## నతి:

ఈ దృశ్య ప్రబంధమునకు సర్వవిధముల మూలమైన 'పలనాటి వీరచరిత్ర' సృజించిన

**శ్రీ శ్రీనాథకవి సార్వభౌమునకు**

జయదేవ కవిరాజ విరచితము లగు అష్టపదులతోపాటు తా మాంధ్రీకరించిన ఆంధ్రాష్టపదుల నీ గ్రంథమున నుపయోగించుకొన ననుమతించిన

**శ్రీ శ్రీ రాజా వేంకటాద్ర్యప్పారాయ కవిచంద్రులకు**

— ఇందలి —

# పాత్రలు



నలగామరాజు
నరసింహరాజు
మలిదేవరాజు
బ్రహ్మనాయుడు
కొమ్మరాజు
అలరాజు
బాలచంద్రుడు
అనపోతు
చందు
కోటకేతుడు
కన్నమదాసు
భట్టు
మల్లు

నాయకురాలు
ఐతమ్మ
మాంచాల
పేరిందేవి
మాడచి

పాటగాండ్రు, నాట్యకర్తె, చెలులు, సేవకులు, చారులు మొదలగు వారు.

(మొదటి రంగము)

[బ్రహ్మనాయుడు దేనిదో దీర్ఘముగ నాలోచించుచుండును.]

బ్రహ్మన్న :

సిరులన్ దేలుచు జీవితంపు బ్రణయశ్రీ నేలుచున్, సద్యశ
స్తరుణీ కోమలబాహువల్లరుల నశ్రాంతమ్ము గ్రీడించుచున్
వరలున్ ధారుణి నెల్లకాలమును, పల్నాడంచు గర్వించి సం
బరమును బొందిన దానికిట్టి ఫలము దేవా! నేడు వీక్షించితిన్.

(నిట్టూర్చి) ప్రభూ! ఏ మోములు పండించు వెన్నెలలకై తపించితినో, ఏ కన్నులు చిలుకు తళుకులు జీవిత సర్వస్వమని మురిసితినో, ఏ మృదుమధుర వాక్స్వరంపరలు నా హృదయ తంత్రులాలపించు రాగమాలిక లని భ్రమసితినో, ఏరి సుఖమునకై నా చిక్కని మేనిరక్తమును ధారవోసితినో ఆ జీవులీ వృద్ధాప్యమున నాకై కల్పించిన శాంతి దిలకించితివా! పెంచి పోషించి, పేర్గన జేసినందులకై ఆ హృదయములు నాకుగా సృజించిన యీ కానిక నాలోకించితివా! బాల్యమాది ధర్మశాస్త్రార్థములు వారికై వినిపించిన నా యీ నోట వారలు పోయ నెంచిన యగ్నిఖండముల నవలోకించితివా! ఏమని విన్నవింతును ప్రభూ! భావమునకు దగు చిత్తరువును లిఖించి, యానందించుచుండ దా నిడిన ప్రాణమే యా పటమును మంటయై భగభగ మండించుట గనులార గాంచెడి శిల్పివోలె నా బ్రతుకెంతటి నిరాశాపూరితమైనది తండ్రీ! సత్యాహింసల కాలవాలమై, సర్వమానవసౌభ్రాతృత్వమునకు బుట్టినిల్లై, శాంతి సౌఖ్యముల నోలాడగలదని యాశించిన యీ పలనాటి రాజ్యరమ కీనాటి కెట్టి దుర్గతి ఘటిల్లినది నాయనా!

(అంతవరకు దూరమునుండి వినుచున్న కొమ్మరాజు ముందునకు వచ్చి, బ్రహ్మనాయుని బుజమును తట్టును. చిరునవ్వు అతని పెదిమలపై చిందులు వేయుచుండును.)

కొమ్మ : మహామంత్రుల కింతటి బేలతనము చెల్లునా బావా!

బ్రహ్మన్న : (లేని నవ్వును తెచ్చికొని) చేలతనము కాదోయీ! (ఆగి, నిట్టూర్చి)...వినుచుంటివి కదా వారి ప్రల్లదములు! కనియుంటివి కదా వారి కుతంత్రములు! నే డీ పల్నాడున బ్రహ్మనాయునకు నిలువనైన దావు కల దందువా బావా!

కర్కుంగత్తులు తాఁవు రక్తమున నిక్కమైన్మెన సామ్రాజ్యపుఁ
సిరి లాస్య మ్మొనరించునంట; బుధులఁ శిక్షించినంగాని రా
చరికంపుంబన వెల్కఁజూడదట నిచ్చల్ సౌఖ్యముం బొంద భూ
వరులే యర్హుల రంట, మూర్ఖతకు రూపమ్మంటనే న్విoటివే!

కొమ్మ: (నవ్వుచూ) ఐనను...బ్రహ్మన్నయే యింతగ భ్రమించు టయా యని...!

బ్రహ్మన్న: ...ఔను బ్రహ్మన్న జీవితమంతయు భ్రమించుటతోడనే కదా సరిపోయినది! (ఆలోచించి) బ్రహ్మన్న తనకు దానై సృష్టి కర్తృత్వము నారోపించుకొనుటయే యిందులకు మూలము; ఏ మందువు బావా! (చిరునవ్వుతో) ఇందనుక మంచి బొనరించిన దంతయు బ్రహ్మన్నయా!...నేటి కీ చెడుగును తెచ్చిపెట్టిన దా నిసుంగులా! ఇదియు భ్రమయే గదా బావా!

[కన్నప ప్రవేశించును. నమస్కరించును.]

బ్రహ్మన్న: బాబూ! ని న్నిటకు రప్పించుటలో గల భావము నెరుంగగోరుదువా?

కన్న: తమ అనుగ్రహ ముండిన.......

బ్రహ్మన్న: (ఆప్యాయముగ) ఏమియు లేదు నాయనా! నా శరీరము నందలి రక్తబిందువులు వేర్వేరుగ బలముల గల్పించుకొని యొండొంటితో బోర సంకల్పించినవి. మానవ ప్రయత్నము మిగిలి పోనీక ఆ యా జీవులతో రాయబారముల జరిపితిని. సంధి కియ్య కొనునేమో యని బహువిధముల ప్రయత్నించితిని ... ఇంకను ప్రయత్నించుచునే యుంటిని. ఆ స్వేచ్ఛాజీవులు పోరునే కోరు నెడ దానికిని దగు యవకాశమును గల్పింప నిశ్చయించితిని... గ్రహించితివా నాయనా... !

కొమ్మ : (సాలోచనముగ) ఉపశమింపజేయుట బ్రహ్మనాయుని శక్తిని మించినగదా ఆ ప్రయత్నములు...!

బ్రహ్మ : (చిరునవ్వుతో)... ఔను బావా...! అట్టి స్థితి తటస్థించుట చేతనే యిట్టిది బల్కవలసి వచ్చినది. నా ప్రాణాపహరణోద్యమమున నొకపక్షమును, నా జీవవాయువుల నాధారముగ గొని మరొక పక్షమును కలహించుచుండ నే నేమి చేయగలనోయీ! నా ప్రాణత్యాగమున నా యిరువాగులవారికిని సౌఖ్యము చేకురునేని అంతకు మించిన యానందము నా కన్య మేమి యుండగలదు? నన్ను నమ్మినవారికై బ్రతికియుండి, చేయగల సాయము నెల్లను జేసి, తుదకు మిత్రివాత బడుటయే శరణ్యమైన నదియు ఘనమే గదా ... ఏ మందువు...!

(బ్రహ్మన్న వారలవంక తిలకించును. కన్నమ కొమ్మరాజు లవనతవదనులై యుందురు)

...... బావా ... కావుననే యీ ప్రయత్నము.

(కన్నమవంక చూచి) బాబూ! యీ విషయములు నీతో ముచ్చటించుటకే నిన్నిటకు రప్పించితిని. పరిసరారణ్య ప్రదేశమును సమరభూమి నొనర్ప నీ వొక్కరుడవే తగువాడవని తలంచితిని ... బోధపడినదా !...

కన్నమ : ......చిత్తము...!

బ్రహ్మన్న : ...బావా! మలిదేవుడు మనకై నిరీక్షించుచుండునుకదా!

కొమ్మ : (స్ఫురణకువచ్చినట్లు శిరఃకంపముజేసి) ఔను...పయనింతమా!

బ్రహ్మ : ......అవశ్యము.

(బ్రహ్మన్న దారి తీయును. కొమ్మరాజూ కన్నమదాసూ అతని ననుసరింతురు.)

(యవనిక పతనము)

(రెండవ రంగము)

(ఐతమ్మ యింట పూజామందిరము, చెన్నకేశవునకు హారతి నిచ్చుచు ఐతమ్మ వెనుక నొక పరిచారిక.)

ఐతమ్మ: (అష్టపది) వసతి దశనశిఖరే - ధరణీ తవ లగ్నా
శశిని కళంకకళేవ నిమగ్నా
కేశవ! ధృతసూకరరూప! జయ జగదీశ! హారే!

(ఆంధ్రాష్టపది) అల నీకోరకొనన్ - వెలసెను భూమి గనన్
నెలకళ మునుకల - లలినీడ యనన్
కేశవ! ఓమ్, వరాహావతార! జయ జగదీశ! హారే!

పరి: అమ్మా......!

ఐత: ...ఏమే...!

పరి: (ద్వారము వంక చూపుతూ)...చిన్నబాబుగారు.

ఐత: (సంతోషమున) వెంటనే దారి జూపవే!

(పరిచారిక నిష్క్రమించును, బాలుడూ చందూ ప్రవేశింతురు. దైవమునకు శిరము వాల్తురు; తదుపరి ఐతమ్మకు నమస్కరింతురు.)

ఐత: (బాలురను నిదానించిచూచి, వారి నమస్కృతి నందికొని, యెదిరూ దీవించి)
మా బంగరు నాయన లందరు గుశలురే గదా!

బాలుడు: తమ మహదాశీర్వాద బలమున...!

ఐత: (పరిచారిక వంక చూచి)...శాంతా...బాలురకు హారతు లీయవే...!

(పరిచారిక హారతి నిచ్చును.)

ఐత: పెద్దబా బెద్దియో ఆలోచించుచున్నాడు...!

అనపోతు: ......ఔనమ్మా......ఏమిచేయుటకును దోచక...!

ఐత: అది యేమి నాయనా......!

అన: ...ఏమున్నది...? మీ బిడ్డని మీ కడ చేర్చితిని...నాకు సెలవు!

(బాలుడు భయముతో అనపోతువంక చూచును.)

ఐత: బాబూ! నీ మాటల కర్థము...?

బాలు : (చిలిపిగ) అతని మాటల కర్థము కూడనా...?

(అనపోతు బాలునివంక గంభీరముగ చూచును. బాలుడు తల వాల్చికొనును.)

ఐత : ...బాబు లీ నా డిట్లుండుట భయానకముగ నున్నదే...!

అన : మీకు దెలియని కారణ మేముండునమ్మా! అతడా వెలమబిడ్డడు. అత డెట్టి పందయైనను ప్రజ లాతనిని శౌర్యధను డనియే గదా యుగ్గడింతురు. నేనో...బ్రాహ్మణుడను! నా హృదయానలజ్వాల కాళ్ళపినంతను గబళింపజాలినను నది నా ధర్మదేవతకు గప్పురపు హారతియై పోవలెను...కారణము నాకును తెలియకున్నదమ్మా!

(బాలుడు తల వాల్చికొనును)

ఐత : బాబూ! యీ యపూర్వ సంభాషణము నా కగ్రాహ్యముగ నున్నదోయీ! ఐనను...భూసురసంతానమున కింతటి యావేశము పనికిరాదేమో!

అన : ... ఔనమ్మా ... నా విచారకారణము నదియే...!

ఐత : బాబూ! అట్లయిన నితని నిప్పు డేమి చేయుమందువు...?

(బాలుడు దీనముగ అనపోతువైపు చూచును.)

అన : ఇతనికి జీవితమున గల యనురాగమును అభిమానముగ మార్చి కొమ్మందును.

బాలు : (కుపితుడై) చూచితిరా నన్నతడు చుల్కన జేయుట... !

ఐత : (దీనముగ) నాయనలారా! ఇంతవరకును నేకగర్భజనితులవలె మెలగుచున్న మీ కిట్టి మనోవైకల్యములు కలుగుట శ్రేయోదాయకములా! ఆటపాటలయందు కాలము బుచ్చవలయు నీసమయముననా మీ కిట్టి విచారములు? ఏదీ...ఒక్కమారు మీనాల్గు కండ్లనూ కలిపి నా హృదయమునకు శాంతి చేకూర్పుడు...

(బాలునితో) ...... బాబూ ...!

(బాలుడు తల నెత్తడు.)

(అనపోతుతో)...బ్రాహ్మణులే అన్నిటను మార్గదర్శులేమో !

(అనపోతూ బాలుడూ కలిసి నవ్వుదురు.)

(తెరలో)

అన్నా ...! అన్నా ...!!

ఐత : (ఆ పల్కులాలించి) శారదా! చందు నిటకు తోడ్కొనిరావే...!

[శారద వెడలును]

ఐత : బాబూ! ఆడికొనుటకు వేళ యైనది కాబోలునే...!

(చందు ప్రవేశించును; ఐతమ్మకు నమస్కరించును. ఆమె స్వీకరించి శారద వంక సార్థకముగ జూచును. శారదప్రక్కనే ఉన్న పళ్ళెరము నందికొని అతనికి హారతి నిచ్చి కుంకుమ బెట్టును.)

ఐత : కుమారా! ఏ మట్లాయాసపడుచుంటివి?

చందు : ఏమియు లేదమ్మా! అన్న ఆడుకొనుటకు బొంగరముల దెత్తునని యిచటకు వచ్చి యాలసించుటచే కారణ మరయుటకై పర్వెత్తుకొని వచ్చితిని.

ఐత : (భయమున బాలుని దిక్కై) బాబూ...!

బాలు : (మెల్లగ)...అమ్మా...!

ఐత : నీ కింకను బొంగరముల మీది మోజుపోలేదా నాయనా! బొంగరములు చక్రములవంటివి గదోయీ! మీ రొకచో విడిచిన నవి వేరొకచో నిలచి చూపర కపాయమును గల్పింపగలవు, తండ్రీ! ఆ యాట మన కీ సమయమున నుచితము కాదోయీ!

(బాలుడు చిన్నవోయి నిలబడి యుండును.)

ఐత : నీ వంతగ కించపడరాదు నాయనా! బొంగరములు కోరపడియానే నట్లంటినని? ఏ ముహూర్త మెటువంటిదో, ఎవరి నాల్కపై ఏ వేళకు తాచు నిలబడి యుండునో, ఎట్టి యపవాదులకు మీరు గుఱియాదురో యనునదియేగదా నా వల దనుటకు హేతువు?

(అనపోతుతో) ... ఏమందువు నాయనా!

అన : మీ మనము నా కవగత మైనదమ్మా...!

ఐత : (చందుతో) ... నాయనా ... నీవో...?

చందు : ఔనమ్మా...కాని, బాల్యచాపల్యమో?

బాలు : (చిరునవ్వుతో) ...అమ్మా ...చందు నా యభిప్రాయమునే వివరించినాడు.

ఐత : (నిట్టూర్చి) కానిండు నాయనలారా! మన చెన్న కేశవుడే మిమ్ము కాపాడగలడు.

బాలు: ఐన...అనుజ్ఞయా...!

ఐత: బాబూ! మేడపి బహుజనాకీర్ణము; మీ యాటలకిది తావు కాదు. చాలురాపులకడనున్న వటవృక్షచ్ఛాయ నాశ్రయించి యాడికొనుడు! అది నిరపాయప్రదేశము...

(బాలునితో) ... ఏమి నాయనా...!

బాలు: ఆజ్ఞ ...!

(అందరూ ఐతమ్మకు నమస్కరింతురు. ఆమె స్వీకరించును. బాలురు కదలి పోదురు. వారలనే తిలకించుచు ఆమె నిలబడును.)

(యవనిక పతనము)

## మూడవరంగము

(బ్రహ్మనాయుడు గుడారమున పచారు లొనర్చుచుండును; ఏదియో వినుట నభినయించును.)

బ్రహ్మన్న: ...ఎవ రక్కడ...?

1 సేవకుడు: ...ఆజ్ఞ ప్రభూ...!

బ్రహ్మన్న: ...ఆ...కలకలమునకు కారణము...?

1 సేవ: చెన్నకేశవాలయము నుండి వచ్చు బ్రాహ్మణుల సంతోష చిహ్నము ప్రభూ!

బ్రహ్మన్న: ఈ సమయమున నిది యపూర్వ మేమో!

సేవ: చిత్తము ప్రభూ! గతరాత్రి అలరాజులుంగారి కొక దుస్స్వప్నము వచ్చిన దట! అది కారణముగ వారు హోమాదులను చేయించి, ఆలయమున నర్చనలు సలిపి దానధర్మాదుల నొనర్చిరట, ప్రభూ!

(మరియొక సేవకుడు వచ్చి అనతిదూరమున నిలబడి యుండుట బ్రహ్మన్న చూచును. అతడు నమస్కరింప గ్రహించును.)

బ్రహ్మ: ...ఏమిరా విశేషములు...?

2 సేవ: ద్వారముకడ అలరాజులుంగారు......!

బ్రహ్మ : ...ఆజ్ఞ యైనది.

(రెండవ సేవకుడు నిష్క్రమించును. బ్రహ్మన్న 1వ సేవకుని దిక్కు...)

నీవు పోయి కొమ్మరాజులుంగారికి మా మాటలుగ చెప్పి వేగమే తోడ్కొని రమ్ము.

(అలరాజు ప్రవేశించును. బ్రహ్మన్న పరధ్యానముగ నుంట నది గ్రహింపడు.)

అలరాజు : (సవినయముగ) మహామంత్రులకు అలరాజు కేల్మోడ్చినాడు.

బ్రహ్మన్న : (అటు దిక్కై) శుభము చేకురగలదు నాయనా!

అల : తమ ఆజ్ఞ. ఉషోదయ కాలమునకు పూర్వమే అందికొనినను యిందనుక దర్శనముచేయజాలనందులకు క్షంతవ్యుడను.

బ్రహ్మ : భయ ముడుగుము నాయనా!

(అలరాజు కృతజ్ఞత చూపును.)

బ్రహ్మ : కుమారా! నీలోని ఆవేదనకు మూలము...?

అల - (చకితుడై) గతరాత్రి తుదియామమున పొందిన దుస్స్వప్నమని మనవిచేసికొన సిగ్గిలు చున్నాను ప్రభూ!

బ్రహ్మ : (దీర్ఘముగ నతని దెస పరికించి చూచి) ఏన నది యెట్టిది కుమారా!

అల : (మెలమెల్లగ) నే నొక ప్రాణమిత్రునితో గలసి అపూర్వకార్యాలోచనానిమగ్నుడనై ఒక గిరీంద్రోపరితలమున బోవుచున్నానట. ఆ సమయముననే భీకరఝంఝామారుతము వీచి ఆ ప్రదేశము నంతను గగ్గోలుపరచినదట. ఆ మార్గము మిగుల నపాయకరమైనది. క్రిందకు చూచితిమా ఒకదెస పెద్దఅఖాతము, మఱియొక వంక గభీరసముద్రము. నడుమప్రదేశము నగ్నసౌందర్యమున నాట్యమాడు ప్రకృతిదేవి తలపాపటయా యను భ్రాంతి గలిగించుచుండును. నా మిత్రు డయ్యది యంతయు దిలకించి, ముందునకు గమింప నాతురపడి, స్వప్రాణరక్షణార్థమై న న్నొకవంకకు త్రోసి పర్వెత్తినాడట, ప్రభూ! ఏమని విన్నవింతును. ఆ గిరీంద్ర శృంగాగ్రమునుండి గభీమని ఆ రాతిపలకలకు నా తలను బాదికొనుచు క్రిందకు జారి నిశాకన్య తాండవించు పాతాళమున బడిపోయినా

నట. (భయముతో) తలచుకొనినంత మాత్రముననే ఒడలు జలదరించుచున్నది ప్రభూ!

బ్రహ్మన్న : స్థిరపడుము నాయనా! చెన్నకేశవు ననుజ్ఞ లేని దెద్దియు జరుగనేరదు కదా!

(కొమ్మరాజు ప్రవేశించి అలరాజు తుదిపలుకుల నాలకించును.)

కొమ్మ : (గంభీరముగ బ్రహ్మనాయుని చేరి)...బావా! అల్లుని భావ కల్లోలమునకు కారణ మేమి...?

(అలరా జాతని జూచి నమస్కరించును. కొమ్మరాజు ప్రేమపూర్వకముగ స్వీకరించును.)

బ్రహ్మన్న : (చిరునవ్వుతో)...కుఱ్ఱతనము. ఎదియో దుస్స్వప్నమును గాంచె నని తచ్ఛాంతికై దానధర్మాదుల నొనర్చినాడు.

(కొమ్మరాజు గంభీరముగ ఆలోచించు చుండును. అలరాజు లజ్జ నభినయించును.)

బ్రహ్మన్న : బావా...!

కొమ్మ : ('ఏమి?' అన్నట్లు చూచును.)

బ్రహ్మన్న : మలిదేవమహీనాథుని అభిప్రాయమును కుమారున కెరుక పరతువా...!

కొమ్మ : (చిరునవ్వుతో) అందుల కనియా నన్ను పిలిపించితివి?

(అలరాజు యిరువురి వంకను చూచుచుండును.)

బ్రహ్మన్న : ఔను...తండ్రివిగదా యని.

అలరాజు : (చిన్నవోయి) అలరాజు మహామంత్రుల మాటలను పాటింపని మూర్ఖు డనియా మీ భావము...!

బ్రహ్మ : ... పరిహాసమున కంటినోయీ...!

అల : ... ఐన ... ఆజ్ఞ.. ?

కొమ్మ : తెలుపు మందువా...బావా...!

బ్రహ్మ : ఆలసించుటలోగల అనౌచిత్యము సర్వసైన్యాధ్యక్షునకు తెలియని దెట్లాను...?

అల : తండ్రీ...! ఆ విశేషము నెరుగ అలరా జాతురపడుచున్నాడు.

కొమ్మ : (గంభీరముగ) కుమారా! నాపల్కిన దెల్లను మలిదేవనృపా లుడు నీకుగా దెల్పుమని యుద్దేశించిన అసామాన్యవిశేషము.
అల : అది యెద్దియైనను శిరసా వహింతునుగదా నాయనా...!
(బ్రహ్మనాయుని ముఖమున సంతోషము కన్పడును. కొమ్మరాజు సగర్వముగ పలుకును.)
కొమ్మ : నీహృదయము నే నెరుగనిది కాదోయీ ... ఐనను ...
అల : సందియ మేల తండ్రీ ...!
కొమ్మ : ఏమియు లేదు నాయనా! కుమారు డెంతటి శూరశిఖామణి యైనను తండ్రిప్రాణ మప్పు డప్పుడు తల్లడపడుచునే యుండును గదోయీ!

(అలరాజు కృతజ్ఞత చూపును.)

బ్రహ్మన్న : బావా...! వృద్ధాప్యము ముదిరినకొలదియు నీవు భీతికి తావల మగుచున్నావుగదోయీ!

(కొమ్మరాజు లేనినవ్వును తెచ్చికొనును.)

అల : తండ్రీ...ఆజ్ఞ...!
కొమ్మ : (సహర్షముగ) వినిపించుచున్నాను కుమారా! నలగామనృపుని చెంతకు మన మలిదేవ భూపతి సంధిప్రయత్నమునకై యెవరి నైన నియోగింపదలచి మాతో విచారించెను. మాటకు మారు పోటున కుపక్రమించు నాయకురాలి కనుసన్నల మెలగు ఆ ఆస్థానమున నద్వితీయులై కార్యానుకూలతను ఘటించి రాగల యుపజ్ఞ యెవరియందు కలదా యని యోచించి తుదకు నిన్నే ఆ రాజకార్యనిర్వహణార్థము పంప నెంచినారోయీ......
అల : ఇది రాజేంద్రునకును, మహామంత్రులకును మన పై గల అభిమానమునకు తార్కాణ గదా తండ్రీ!

(కొమ్మరాజు గంభీరముగ నుండును. బ్రహ్మన్న ఉత్సాహముగ నుండును.)

కొమ్మ : ఔను నాయనా! ఇక కొమ్మరాజుకుమారునకు వివరించి తెలుపవలసిన దే మున్నది...?
అల : ...తమ ఆశీర్వాదబలమున...

(కొమ్మరాజు అలరాజును దీవించును.)

బ్రిహ్మ : ...నాయనా...!
అల: ఏమి ఆజ్ఞ...?
బ్రిహ్మ : మాచర్ల మంత్రుల మంతయు నీకు మంగళమునే వచింప గల దోయీ.......!
అల: కృతజ్ఞుడను...సెలవా...!
(బ్రిహ్మన్న యేదియో యోజించుచు దారి తీయును. ఇతరులు అనుసరింతురు.)
(యవనిక పతనము)

## నాల్గవ రంగము

[నాయకురాలు ఏమియు తోచక విలాస గృహమున తిరుగాడుచుండును.
నాయకురాలు : బ్రహ్మన్నా...!

గురుడవు సర్వశాస్త్రములకుం గురువర్యుడ వీవ యంచు సో
దరుల సుఖమ్ము నెల్లను మదమ్మున నీ యడచేతనుంచి యా
దరమున నర్ధరాజ్యమును దానము చేయ గ్రహించి మేటి జూ
దరి వను పేరు గాంచితి కృతఘ్నుడ భూపునిగుండె నీరుగాన్.

నీ కిట్టి విపరీతపుకోర్కలు జనించుట సర్వనాశనమున కేగదా! శాఖల బడి వేడికొనుటకు మారు నీవును నావలె సర్వాధికారమును చెలాయింప నెంచి యెంతటి నైచ్యమునకు పాల్పడుచుంటి వోయీ! ఛీ...! ఎంతటి భీరుత్వ మోయీ అమాత్యవర్యా! సమరక్షోణిని చేరుటకు నీ చేసిన సన్నాహములును, పెట్టిన గడువును ఎంతటి శక్తి విహీనములై పోయినవోయీ! నేడా నీ కీ నాయకురాలి ప్రభావము కన్నులకు కట్టినది? నేడా నీ సలుప నెంచు రాయబారము లీ నాయకురాలి కడ ఫలించునవి? ప్రల్లదము లెవరివో కార్యశూరు లెవరో నేడైనను నీ హృదయము విప్పి చెప్పుచున్నదా, బ్రహ్మన్నా...!

[సేవకుడు ప్రవేశించును.]

నాయ : ... ఏమిరా ... !
సేవ : ... నరసింహప్రభువులు ...
నాయ : (వికాసవదనముతో) ఆఁ...లోనికి దారి చూపుమురా...!
సేవ : చిత్తము. (నిష్క్రమించును)

నాయ : ఉహుఁ ... ! ఈ నరసింహుడే నాచేత లేకున్న నలగాముని ముంగల నాకార్యవిధానము నెగ్గియుండెడిదా !

[నరసింహుని ప్రవేశము]

నాయ : (ఎదురేగి) ... రావోయీ ... సాహససార్వభౌమా ... రావోయీ !

నర : ఏమి మహామంత్రిణీ! మరికొంతకాలములో మహాసభామధ్యమున కలియనున్న నన్నుషోదయకాలమునకు పూర్వమే పిలువబంపితివి !

నాయ : (సాలోచనముగ) ఔనోయీ ... ! అయ్యె దొక అత్యావసర విశేషము.

నర : ఐన...ఏమని ఆజ్ఞ...?

నాయ : (చిరునవ్వుతో) ఇది ఆజ్ఞాపించు తరుణము కాదోయీ ! ఆత్మ గౌరవపరీక్షాసమయము.

నర : (చికాకును కప్పిన గర్వముతో) నాయకురాలు ముచ్చటించునది నరసింహునితో నని తెలియు ననుకొందును.

నాయ : (వికటముగ) ఉ హుఁ...! నలగాముని మించినవాడా యీ నరసింహుడు !

నర : ... నాగమ్మా ... ! అనుగుభూపతి అనుంగుపుత్రు నవమా నించుటకా యీ సమావేశము !

నాయ : (బెట్టుగ)...... అనుంగుపుత్రుడేయైన నా కీ విచార మేల...?

(నరసింహు డేదియో ఆలోచించుచుండును. నాయకురా లతనిని చేరి వినయము నటించుచూ)

......చిన్నదొరా,..!

నర : ('ఏమి!' అన్నట్లు చూచును)

నాయ : నీ పితృపాదునకు మనశ్శాంతియు, నీ ప్రియసహోదరునకు వెలలేని గౌరవము నీయ సమర్థుడవేనా!

నర : ...కా కేమి...?

నాయ : నీ సోదరు నేకచ్ఛత్రాధిపతిగ చూడ నీకు మనసు గలదా!

నర : అన్య మెట్లుండ గలదు?

నాయ: ఈ గురిజాల రాజ్యరమపై నాకు గల గాఢాభిమానమును నీవు మనసార నమ్మియుంటివా...!

నర: ఆఁ...ఔను...

నాయ: ఔ నందు వేమి? ఈ పలుకులు నీ హృదయాంతరాళమునుండి బహిర్గతము కాలేదేమో...!

నర: (కొద్దిగా ఆలోచించి) ...నమ్మియే యుంటిని.

నాయ: ఆత్మగౌరవము గల నీ వీ నమ్మికనే మనసార నిల్పుకొని యుండగలవా...!

నర: (ఆమె వంక చూస్తూ) ఆఁ...ముమ్మాటికినీ.

నాయ: ఐన...(ప్రేమతో) నే నిప్పుడు తెల్పునదెల్లను నీ తండ్రిపై నొట్టుపెట్టికొని నీ హృదయముననే దాచికొనగలవా!

నర: (ఆలోచనతో) వీమి తెల్పుదువో తెలియకనే యింతటి శపథము చేయుటయా నాగమ్మా!

నాయ: (దృఢముగ, వికటముగ) మరి నాయందు నీకు గల నమ్మిక...?

నర: ఆఁ...దృఢమైనదే...!

నాయ: ఐన... (చేతిని చాపును. అత డామెచేత చేయిని కలుపును.)

నాయ: సెబాస్! నరసింహా! (గంభీరముగ) ఆఁ...! ఆ వెలమగరళము మన సద్యశోదుగ్ధభాండమున కలియ నిచ్చుట నా అభిమతము కాదో యీ...నీవే మందువు...?

నర: అ ట్లెన్నటికిని కానేరదు.

నాయ: క్షత్రియవీరులకు సంధిప్రయత్నములు చప్పగ నుండునుగదా!

నర: (నవ్వి) కాదనువాడు క్షత్రియు డెట్లు కా గలడు?

నాయ: ఆఁ...! బ్రహ్మనాయుడు మీ అన్నను మాయోపాయముల లొంగించికొన జూచుచున్నాడు....అది నీవును సహింపజాల వను కొందును.

నర: ఔను...! నరసింహుడు సజీవముగ నున్నంత కాలమట్లు జరుగ నీయడుకూడ.

నాయ: భళీ...! క్షాత్రి మన నది. ఐన నరసింహా! ఆ ప్రయత్న విచ్ఛేదనోద్యమమున స్వప్రాణత్యాగమే గాదు పరప్రాణాప హార

ణముకూడ అనివార్య మానేమో!

నర : చచ్చుటకుముందు చంపుట యనునది క్షత్రియోచితకృత్య మని తెలియజాలని మూర్ఖుడా యీ నరసింహుడు ?

నాయ : (ఆనందముతో) ధీరుడ వోయీ ! కాని...

నర : సందియమునకు మూలము...?

నాయ : ఏమియు లేదోయీ! ఆ సమయమున యోధునకు ప్రాణ భీతి యనున దెట్లుండదో సోదరులనియు, బంధుమిత్రులనియు కూడ నుండదు. తెలిసితివా...!

నర : ఔను...! అదియేకదా సమరధర్మము.

(అప్పుడే ప్రవేశించిన నలగాముడా పల్కు లాలించును)

నలగాముడు : నరసింహునకు సమరధర్మోపదేశ మొనర్చు నాయకు రాలికి నలగాముడు కృతజ్ఞత దెల్పికొనుచున్నాడు.

(నరసింహుడూ నాయకురాలూ చకితు లౌదురు. అటు నలగాముని గాంతురు. శిరములు వాల్చుకొందురు.)

నల : (నాయకురాలి దెస చూచి)... ఇందు సిగ్గిలునవసర మే మున్నది నాగమ్మా......!

నాయ : సుక్షత్రియవంశోద్భవులకే క్షాత్రధర్మనిరూపణ మొనర్ప దలచుట.

నల : ...ఏ మున్నది .. అవసరమైనది కావలె...

(నాయకురాలి చిరునవ్వు, నరసింహుని విన్నదనము)

నల : వినుము... నీ నుండి నేర్చికొనుట ముదావహమును సర్వశ్రేయో దాయకమును గదా...?

నాయ : కృతజ్ఞురాలను!

నల : నరసింహా...! నాయకురాలు నీ ఒక్కరునకే గాదు యీ నల గామ సార్వభౌమునకును అధ్యాపకురాలు. ఆమె శక్తి సామర్థ్య ముల విని, కనినంత మాత్రమున్న మనము రాజ్యార్హులమౌట కల్ల. గ్రహించితివా...! ఆమె కనుసన్నల మెలగుటయే మనకును, ఈ పలనాటి కంతటికిని గూడ గౌరవము. ఆమె మన హృదయముల నావరించియున్న అజ్ఞానజీమూతమును పటాపంచలు చేయ నవత

రించిన జ్ఞానరత్నంర్ఘానిలము. నేడీ మానవస్వరూపమున గోచరించు నాయకురాలు మన పాలిటి భాగ్యదేవత; గురిజాల రాజ్య వధూమణి అపరావతారము. తెలిసితివా నరసింహా...!

నాయ: కృతజ్ఞురాలను ప్రభూ...! కాని......

నల: సందేహము......?

నాయ: ఏమియు లేదు ప్రభూ! మీ అభిమానము నెట్లుగా నిలిపికొని ప్రీతిసేయగలనా యనునదియే నా హృదయవేదన.

నల: అది యేమి నాగమ్మా...? ఈగురిజాల నీయది. ఈ నలగామ నరసింహులు నీ యధీనమునందున్న ప్రాణులు. నీ వెయ్యది యొనర్చినను మా శుభము నాశించియేగదా! ఈ నాడా బ్రహ్మనాయుని మంత్రాంగమునకు లొంగక సురక్షితముగ నున్నా మన నీశక్తి సామర్థ్యముల మూలముననే కదా! నీవు వినా యీ పలనాటి నుద్ధరింపగల ప్రతిభాసమన్వితు లెవరు నాగమ్మా!

నర: ...ప్రభూ...!

నల: ఏమి నరసింహా ..!

(నాయకురాలు నరసింహునివంక తదేకదృష్టితో తిలకించును. నరసింహుడు తిరిగి అవనతవదనుడగును. అతనిలో భరింపరాని అవమాన ముద్యోతమాచుండును.)

నాయ: ఏమియు లేదు ప్రభూ! అతని యౌవనోద్రేక మప్పుడప్పుడటులనే బహిర్గత మాచుండును.

నల: (నవ్వి)...ఉహుం...పిన్నతనము.

నాయ: ...నరసింహా...!

నర: (తల నెత్తి చూచును)

నాయ: నా తెల్పిన దెల్లయు జ్ఞప్తియందున్నదిగదా! (బుజ్జగింపుగ)...పోమ్మ...ఎవరి ధర్మమును వారు నెరవేర్చుకొనుట విధి. అటుల సలుపుటలో ప్రతిఫలాపేక్షకును మెప్పునకును తావు లేదు. తప్పితిమా పాపము తప్పక చుట్టుకొని తీరును...గ్రహించితివిగదా...!

(నరసింహు డవనతవదనుడై వెడలును. నాయకురాలూ నలగామడూ నవ్వుచూ మరొక మార్గమున గమింతురు.)

(యవనిక పతనము)

## ఐ ద వ రం గ ము

[చాలురాపుల వద్ద బాలుడూ, చందూ, అనపోతూ ఖిన్నులై నిలబడియుందురు.]

చందు : ఎంతటి ధనవంతుని యిల్లాలైనను యింతటి అహంభావమా అన్నా !

అన : (చిరునవ్వుతో) ఇంతామె దోస మేమున్న దోయీ ! కటిక చీకటిని గమించు పాంథుడు తనకు దారి చూప ప్రకృతిదేవి పంపిన విద్యుల్లతను చూచి తొలుత యిటులనే చకితు డగును.

బాలు : ...కాని, బ్రహ్మనాయుని కుమారున కొక వైశ్యాంగన ధర్మోపదేశము చేయవలసివచ్చెను గదా యను నదియే నావిచారము.

అన : ఏమి...? అట్లు కారా దనియా !

బాలు : కాదు... ఐనది కదా యని.

అన : అది తలచుకుని గర్వించుటకు మారు క్రుంగిపోయెద వేల...?

(బాలుడు మాట్లాడడు)

చందు : (కోపముతో) ఏమి...? అవమానింపబడినందులకై ఆనందింపవలె ననియా నీ భావము !

అన : (నవ్వుతూ) ఔను. పల్నాటి గడ్డమీద పుట్టిన ప్రతిపడతియు నట్టి పౌరుషాగ్ని నే ప్రజ్వలింపజేయునని గ్రహించిన గర్వింపక గర్హించువా రెవ రోయీ !

బాలు : చందూ ! అనపోతు తెల్పినదెల్ల యథార్థమే; కాని, ఆ పౌరుషజ్వాలయే బాలచంద్రుని పూర్ణాహుతిగ గొనునేమో యను శంక ఆమెకు కలిగినది కాదు.

అన : అట్టి అవసరమును లేదేమో !

చందు : (గంభీరముగ అనపోతువైపు తిలకించి) తలచుకొనినచో ధరాతలము నెల్ల తారుమారొనరింప నగు బాలచంద్రునిలోననా ఆమె పరాభవానలమును రగుల్పనెంచుట? నీవును ఆమెపలుకుల నేమని సమర్థించుచుంటి వన్నా !

అన : (చిరునవ్వుతో) ఆమె మాత్ర మేమనిన దోయీ! ఖడ్గములతో కదనభూమిని శత్రుమస్తకములపై తాండవించెడి తండ్రిని చేరక

యింటివద్ద బొంగరములతో యింతులమీద అధికారమును చూప దలంచు కేటికి మగతన మనియే కదా ఆమె పల్కినది!

(బాలుడు నొచ్చుకొనును)

ఐనను...క్షీరమునకు తోడుబెట్టి దధి నాకాంక్షించు వారు ఆ క్షీరము స్వీయరూపమును మార్చుకొనునే యని విచారింతు రటయ్యా!

బాలు : (నిట్టూర్చి) ఇక మన మేమి చేయవలె నన్నా......!

అన : కర్తవ్యము నెరిగితిమి గదా! ఇక కార్యాచరణకు గడంగవలె.

బాలు : ...ఐన...?

అన : సందియ మేల...? వెలమ బెబ్బులి వెనుకంజవేయుట తెలుగు భూముల నెన్నడును లేదు గదా!

(బాలచంద్రుని మోమున చిరునవ్వు, చందులో దీనత్వము, అనపోతులో ఆనందము వెల్లివిరియును. అందరును బయలుదేరుదురు.)

(ఒక బిచ్చగాడు పాడుకుంటూ ప్రవేశించును. బాలు రది విని ఆగుదురు.)

బిచ్చగాడు :

—॥ పాట ॥—

లోకంపు బాటలో చీకాకు పడక
నరుడవై బ్రతుకరా! పురుషుడా! నీవు. —లోకంపు...
రాము డడవికి బోయి రక్కసుల దునిమె
కర్ణు డంబుధి జేరి కలచె శాత్రవుల
ఖడ్గతిక్కన కత్తి కదనమ్ము జూచె
కొండెలుక మొగలాయి గుండెలను కలచె
వీరమాతలచేత లేరికో వేర !
కార్యశూరుల జాడ గనబో వదేర! —లోకంపు...

## ఆరవ రంగము

[దేవీసన్నిధానమున మాంచాల ప్రక్కగా చెలికత్తె]

మాంచాల :

అష్టపది : గోపకదంబ నితంబవతీ ముఖ చుంబన లంబితలోభం
బంధుజీవ మధురాధర పల్లవకలిత దరస్మిత శోభం
విపులపులక భుజపల్లవ వలయిత వల్లవయువతీ సహస్రం
కరచరణోరసి మణిగణభూషణ కిరణ విభిన్న తమిస్రం

ఆంధ్రాష్టపది :
తేటైన చిరునవ్వు నీటౌ మెత్తని మాట తియ్యానా కెమ్మోవివాడే
మోటు గొల్లలగుంపు బోటుల మోముల ముద్దెంతో యాసించినాడే
పులకల చిగిరించు చేపట్ల నెందరో లలనల లాలించువాడే
బలు మేన రత్నభూషలకాంతి చీకట్ల తొలగించు తేజంబువాడే...

(హారతి నిచ్చుచూ చెలివంక చూచి, ఆమె పరాకుగ నుంట గ్రహించును.)

చెలీ...! పరమ పావనమైన యీ పూజా మందిరమున నీ కీ పరా కేమిటే...!

చెలి : (కలవరపడి, మాంచాల దిక్కై) క్షమింపు మక్కా! లోన నెదియో కలకలము వినబడినది...అందుచే...

మాంచా : అది ఏమైన నీ కేమే...! ఏకాగ్రత లేని పూజలు ఫలించునటే...!

(చెలి శిరమును వంచి కొనును. దేవికి నమస్కరించును.)

మాంచా : కనులు మూసికొని, ఎదియో ప్రార్థించి, ప్రసాదమును చెలి కీయ బోవుచూ)...చెల్లీ...ఇక చెప్పుము...!

చెలి : ఏమీ లేదమ్మా...మీ అత్తగారి ప్రసంగమువలె నున్నది...

మాంచా : (కనులు మూసికొని) ఆఁ...! అంతయూ తెలిసినదే...!

చెలి : (చిలిపిగ నవ్వుచు) నాకు మాత్రము తెలియలేదనుకొంటివా!

మాంచా : ఏదీ ...! నీకు తెలిసిన దానిని చెప్పవే !

చెలి : నీవు ముందుగ చెప్పిన ఔనో కాదో నేను చెప్పెదను.

మాంచా : (బెట్టుగ) ముందుగ నే నేల చెప్పవలె...!

చెలి : పోనీ. ..! నా కేనా... ఆ తొందర కూడ...?

మాంచా : (బుజ్జగించుచూ)... నాకే గావలె...? ఐనను నీ కేమియు తెలియదని నాకు తెలియునులే...!

చెలి : (పౌరుషముతో) పందెము గట్టెదవా...?

మాంచా : (నవ్వి)...ఆఁ...!

చెలి : చెప్పనా...?

మాంచా : (చిలిపిగ) ఊఁ...!

చెలి : (తొందరగ మాంచాల చెవిలో రహస్యమువోలె బిగ్గరగా పల్కుచూ) బావగారు రేపటకు వత్తురు...! ఔనా...?

(కాన్క నిమ్మని చెయి జాచును.)

మాంచా : (చిన్నబుచ్చుకున్న మోముతో లజ్జ నభినయించుచూ) ఇంకను పందెము గట్టలేదే పిచ్చిదానా...?

(చెలి కోపము నభినయించును)

మాంచా : చెల్లీ... ఉన్నదంతయు చెప్పెదునా—!

చెలి : ఊఁ...!

మాంచా: (బరువు గొంతుతో) వివాహమైనది మొదలు నా దురదృష్టముచే నన్ను చేరని ఆమె కుమారుడు కులపగ తీర్చికొనుటకై నేడు తండ్రిని కలియుటకై కదనభూమికి పోనున్నాడు. తల్లి ప్రాణము కాదటే! అందుచే తొలుత నామె వారించినది. మీ బావగారి మాటలకు బ్రహ్మాదులు గూడ యెదురు పల్కలేరు. (చిరునవ్వుతో) అది నీకు తెలియదులే? అందుచే నన్నొకసారి చూచిన మగిడి పోలేరను భ్రమకు చిక్కి, నా దీవెనల నంది పోవచ్చునని వారిని నా వద్దకు పంప యత్నించినది.

చెలి : అదియును వ్యర్థమైనదా...!

మాంచా : వినవే! వారి పూర్వవృత్తాంతము వారికి తెలియదటే అందుచే.........సిగ్గిలి.........

చెలి : రా నన్నారు కావలె...!

మాంచా : (నవ్వి) ఇచ్చట మన మేమని ఆగ్రహించుకొంటిమో కను గొని రమ్మని ముందుగ ఆమెనే పంపినారు. తెలిసినదా...!

చెలి : అమ్మయ్యా...! నేను చెప్పినది కూడ నిజమే నన్నమాట.
మాంచా : (ప్రేమతో) ...కాక పోవుటకు కారణ మేమున్న దే...!
చెలి : ఐన...వారు రాగనే నీ వేమందువు?
మాంచా : (సిగ్గిలి) అనుట కే మున్నది చెల్లీ...! వారి అభిమతమును వారించు నంతటి ధీరురాలటే మాంచాల...?
చెలి : అది కాదమ్మా...! రాక రాక వచ్చుచున్నారు కదా...అని...!
మాంచా : ఐన......?
చెలి : (వెక్కిరింతగ) ......ఐ...న...? ఆ గురుత్వము నా కేల? అందినపండు నేమి చేయవలెనో గూడ నేనే చెప్పవలెను కాబోలు. (నిలబడి) నే చెప్పదలచినది మీ అత్తగారికే చెప్పెదనులే...!
(పోబోవును)
మాంచా : (చిరునవ్వుతో)...చెల్లీ...!
చెలి : (బెట్టుగా) ఊఁ...! ఎందుకు...?
మాంచా : (లేచి ఆమెను చేరి) అందిన పండును అర్హ రీతిని ఉప యోగింపవలె...అదియే కదూ...

(చెలి శృంగారమును సూచించుచూ నవ్వును. మాంచాల యొక దివ్య తేజమును తిలకించిన దానివలె మందహాసము చేయును.)

( యవనిక పతనము )

## ఏ డ వ రం గ ము

[నాయకురాలి మాస గృహమునందు నరసింహుడూ అలరాజూ పచార్లొనర్చుచుందురు. నరశింహుని ముఖమున కపటము ద్యోతమా చుండును. అలరాజు గంభీరముగ నుండును.]

అల : ...అది అసంభవము మామా! ఏ రాజన్యుని సేవయం దీ దేహము కండలు తిరిగినదో అతని కే గదా అర్పింపబడవలె.
నర : ...కాదను వా రెవరోయీ...! ఐనన్ను, గృహీంతల పాత్రా పాత్రవిచారణ నరయవలదా!
అల : తమ అభిప్రాయము...?
నర : (ఆప్యాయముగ) పిన్నవాడవోయీ! నీ కీ ప్రపంచపురీతి బాగుగ

తెలియదు. సలగాముని అల్లుడవుగదా, యే సమయమున కైన నుపకరింపకపోదువా యని వా రింతదనుక నిన్ను గౌరవించిరే కాని, కాకున్న నీ మోమునైన జూతు రనుకొంటివి వటోయీ!

అల : (చిన్నబుచ్చుకొని) మామా... అంతటి నైచ్యమును బ్రహ్మనాయునకా ఆపాదించుట...!

నర : (వికటముగ) బ్రహ్మనాయునకే యన నేల? మలిదేవు డాతని కంటె మిన్నయా? వారి వారి మనోభావములు యీ గురిజాల వారికి క్రొత్తలా? అయినను తిరిగి సార్వభౌముని పాదముల నాశ్రయించిన కాదని తిరస్కరించుట మా కేమైన నానంద మనుకొంటివా? ఎంతటి వెఱ్ఱివాడ వోయీ!

అల : (వికటముగ)...మా పినమామగారి నాల్కపై నాయకురాలు నాట్య మొనర్చుచున్నదే!

నర : (చిరునవ్వుతో కప్పబడిన కుటిలత్వముతో) అనవసరముగ నాయకురాలి నేల నిందింతు వయ్యా!

అల : నిందించుట లేదు మామా! ఆయా వాక్చాతుర్యముల నభినందించుచున్నాను.

(నాయకురాలు ప్రవేశించి, అలరాజును చూడనట్లుగనే నటించును.)

నాయ : నరసింహా! రాక రాక వచ్చిన అల్లుని విడిచి యిచ్చట నేమి ముచ్చట లోయీ!

(నరసింహు డలరాజును చూచి పకపక నవ్వును.)

అల : నాయకురాలి అభిమాన వాక్యములకు అలరాజే కృతజ్ఞత చూపుచున్నాడు.

నాయ : (చకితయైనట్లు నటించి) ఏమి...? ఇత డలరాజా! పరాకున గుర్తింపనైతినిసుమా! ఐనను యెంతలో నెంతగ మారిపోతివయ్యా!

(అలరాజు కృతజ్ఞత చూపును.)

ఇంతకునూ నీకై దిన మొక యుగముగ బుచ్చుచున్న ఆ రాకుమారికి దర్శన మిచ్చితి వటోయీ!

అల: తన రాకకు గల కారణము రాయబార మని మహామంత్రిణికి అలరాజు విన్నవించుకొనుచున్నాడు.

నాయ : అది యేమి నాయనా! రాయబారమునకే రావచ్చును. అందు రాణివాసమునకు పోరా దను నియమ మెచ్చట నున్నది ?

నర : (వికటముగ) అదియే లేకున్న బ్రహ్మనాయుని రాగుండియ బయల్పడు టెట్లు ?

అల : (కోపముతో)...మామా...!

నాయ : (అలరాజుతో) కుమారా! పినమామ పైననా యింతటి యావేశము జూపుట ? తన బిడ్డ మనసును నొప్పించినా వన్న ఉద్రేకమున అత డట్లని యుండును.

అల : అది యేమి మహామంత్రిణీ ! నే నే కార్యమునకై యిటు వచ్చితినో అత డెరుగడా ! నే నేల వీరిని వీడిపోతినో మరచిపోయినాడా! నా పలుకు ప్రతివచనమునకును బ్రహ్మనాయుని తూలనాడుట యేనా యితనికి ప్రస్తుత మని తోచినది?

నాయ : నీ మాటలు కాదనను కుమారా ! ఐనను, మీ మామగా రేమనినారు ?

అల : మహామంత్రిణికి నేను ప్రసంగించినది మహారాజుతో గాని, మామగారితో కాదని మనవిచేసికొనుచున్నాను.

నాయ : ......అభిప్రాయము......?

అల : మామగనే అత డలరాజును స్వీకరించిన అంతఃపురమున నీ వేళ కానందము తాండవించుచునే యుండెడిది.

నాయ : (నరసింహుని దిక్కై) ఓహో ! అట్లనా ! అంతఃపుర మిపుడు చిన్నవోయి యున్నదని యల్లునకు విన్నవించితివా, నరసింహా !

అల : ఔను...! అందరు స్త్రీలవలెనే.

(నరసింహుడు తల వాల్చికొనును)

నాయ : నరసింహా ! అల్లుని అభిప్రాయము నీ క్షేమైన నవగతమైనదా!

నర : మాతృగర్భస్థశిశు వెదియో తెలియజాలు నంతటి ప్రజ్ఞానిధియా యీ నరసింహుడు ?

అల : (తొందరగ) మీ యాప్తితమును నేను గ్రహించితిని, మహామంత్రిణీ...! ఐనను, చల్లకు వచ్చి ముంత దాచుట దేనికి...?

నాయ : అది యేమి నాయనా...! ఇచ్చవచ్చిననే వాక్రువ్వవచ్చును ...లేదో...

నర : (అపవారించి) చుట్టపు చూపుగ నీ రాకను స్వీకరింపవచ్చును.

అల : (గంభీరముగ) మామగారి పలుకులు పుండునకు కారము రాచిన ట్లవుచున్నవి.

నర : (వికటముగ) మగకాసెగట్టిన అల్లునకు ఛలోక్తులు రుచింపవు గాబోలునే!

(అలరాజు తల వాల్చికొనును)

నాయ : రాయబారుల నేరికొనుటలో కూడ చాకచక్యము వలయును గదా నరసింహా!

నర : కాదా మరి...?

అల : మీ శంకకు కారణము...?

నాయ : అల్లు నల్లునిగనే పంపి, రాయబారమునకు మరొకనిని నియమించిన వారి ఉదారస్వభావము బయల్పడి యుండెడిది కదా యని.

అల : (గంభీరముగ) మీలో గల వాత్సల్యమునకు ప్రాంజలిబట్టు అల రాజు రాయబారిగనే ప్రసంగింపకోరుచున్నాడు, మహామంత్రిణీ!

(నరసింహుడు వికటముగ నవ్వును)

నాయ : (ఆగి, అటు నిటు దిరిగి,) ఆఁ...! ఐన నీ కోరెడిదేమి...?

అల : మలిదేవ మహీపతికి న్యాయసమ్మతముగ రావలయు అర్ధ రాజ్యమునుగురించిన మీ సమాధానము.

నాయ : (నరసింహునితో) నరసింహా...! నాయకురాలు రాయబారితో ముచ్చటించుట కేకాంతమును వాంఛించు నేమో!

నర : (గ్రహించినట్లుగా, చిఱునవ్వుతో)...కుమారా! నా మన మిప్పు డన్యకార్యాయత్తమై యున్నది; నే నిక పోవలెను. నీపని ముగించికొని మనయింట విందారగింప వత్తువుగదా?

అల : దైవము నందులకే ధ్యానింతును మామా!

(నరసింహుడు వెడలును)

నాయ : (ఏదియో ఆలోచించి, అలరాజు దిక్కై) ఆఁ...! ఐన, మీ అభిప్రాయము...?

అల: ఏ మున్నది? మీ స్త్రీత్వము నింతదనుక కప్పి పుచ్చిన కర్కశత్వమును తొలగించుకొన ప్రార్థించుట.

నాయ: (గంభీరముగ) రాయబారి హద్దుమీరి మాట్లాడుచున్నాడే!

అల: పూర్వస్మృతి నాల్కకు ప్రాణము పోసినది, మహామంత్రిణీ! హద్దుమీరుట యిందే మున్నది?

నాయ: సరే...కానిమ్ము! ఏదియో న్యాయసమ్మత మంటివే? అది యెట్లు సమర్థించుకొందువు!

అల: రాజ్యతంత్రమునకునూ, మానవత్వమునకునూ గల అంతరమును మీ స్ఫురణకు తెచ్చుటవలన.

నాయ: నీ విప్పుడు వచ్చినది రాజ్యకాంక్షతో కాదా!

అల: కాదు...ధర్మదీక్షతో.

నాయ: అనిన...?

అల: మాకును హక్కుగల యీ యింటిలో నిలువ నీడ నిమ్మని కోరుటకు.

నాయ: ఎవరిని...?

అల: మోసమున నాక్రమించికొనినవారిని.

నాయ: మోసకారులకడకు తిరిగి వచ్చుటలో గల ఉచితత్వము...?

అల: గాఢాంధకారముకూడ ఒక్కొకవేళ పటాపంచలౌ గదా యను ఆశ.

నాయ: ఆశకుకూడ నంత మున్నదేమో!

అల: ఔను...దురాశ కానంతవరకు.

నాయ: (ఉద్రేకమున) గురిజాల వారి గొంతులో నాల్కకుగూడ నరము లున్నవని తెలియరేమో!

అల: (వికటముగ) ఊహు...! నరములే కాదు విచ్చు కత్తులు కూడ కలవని తెలియును.

నాయ: (కోపముతో) తెలిసియు నిట్టి మూర్ఖత్వమా!

అల: (చిరునవ్వుతో) ఇది మానవసహజమగు ప్రయత్నము కాని, మూర్ఖత్వము కాదే!

నాయ : ఈ ప్రయత్నమును విఫలమైన...?
అల : కాదని యేల తలంపరాదు ?
నాయ : ఐనదియే యనుకొనుము. అప్పుడు...?
అల : దానిని కాలమే నిర్ణయింపగలదు.
నాయ : అభిప్రాయము...?
అల : ఎరిగియు త్రాచు తోకపై త్రొక్కిన నేమగునో వేర చెప్పవలయునా !
నాయ : ...త్రాచుకోరలు పూర్వమే పెఱికివేయబడిన... ?
అల : ఊహుఁ...! తల యన నెద్దియో తెలియనివారికి కోరలుగూడ గోచరించుటయా...!
నాయ : (కుపితయై) ఆ యనుమానమును గలదేని కార్యరంగముననే పూడ్చిపెట్టవచ్చును గదా !
అల : (కొలదిగ ఆగి) ఇదియే మీ తుది నిర్ణయ మని సెలవా...?
నాయ : (సగర్వముగ) కాదనజాలువా రెవ్వరు ?
అల : తిరిగి నలగామ నృపాలునిదర్శనము చేసికొనవచ్చునా?
నాయ : ఇందు నలగాముని ప్రసక్తి యే మున్నది ? నా నిర్ణయమును వినుమనియే కదా అతడు నా వద్దకు పంపినది?
అల : (ఆలోచించి) సంతోషము.

(నాయకురాలు దారి తీయును. అలరా జనుసరించును.)

(యవనిక పతనము)

## ఎనిమిదవరంగము

(అంతిపురమున, పేరిందేవి శయనాగారము. చేటి ఆమె నలంకరించుచుండును. అపూర్వానందము పేరిందేవి మోమున లాస్య మొనర్చుచుండును. ఇరువురును గలిసి పాడుచుందురు.)

అష్టపది : సముదితమదనే రమణీవదనే చుంబనవలితాధరే
మృగమదతిలకం లిఖతి సపులకం మృగమివ రజనీకరే!
ఘనచయరుచిరే రచయతి చికురే తరళితతరుణాననే
కురవకకుసుమం చపలాసుషమం రతిపతి మృగకాననే.

ఆంధ్రాష్టపది :

వలపు లెనయనే లలిముద్దులనే చెలియధరము గొను లీలగ
పులక లొదవనే తిలకము నిడునే యలశశిజింకను పోలగ
కెరలు మొగమునే మరుమృగవనినే తరుణి కురుల గడు నమ్మిరక
నెఱిమొగిళులనే మెఱపు తెరగునే కురవక సుమ మిడు నెమ్మికన్.

పేరిం : (అలంకారమును నిలువుటద్దమున చూచికొనుచూ) చెలీ...! ఈ అలంకారములను గాంచి వా రేమనుకొందురో గదే!

చెలి : ఏ మనుకొందు రమ్మా! వారి రాకను గ్రహించి ఆనందమును గూర్ప నిరీక్షించుచుంటి వనుకొందురు.

పేరిం : (లజ్జతో) ......వా రెంతటి మహానుభావులే...

చెలి : (చిరునవ్వుతో) ...ఎవరు కాదందు రమ్మా...!

పేరిం : చూడు...వారు...

చెలి : (గ్రహించనట్లుగ నవ్వుతూ) చెప్పవమ్మా! తప్పే మున్నది...!

పేరిం : ...వారు......

చెలి : ...ఓహో...తెలిసినదిలే......!

పేరిం : (కోపము నటించి)...ఏమిటే ఆ పరియాచకము...?

చెలి : (చిన్న బుచ్చుకున్నట్లుగా తల వాల్చుకొనును.)

పేరిం : కోపగించితివా చెల్లీ...!

చెలి : (బెట్టుగ)...ఊఁ...!

పేరిం : (దీనముగ) వల......?

చెలి : (చెప్ప నన్నట్లుగా తల యూచును.)

పేరిం : పోనీవే...! మాటకే యింతటి కోపమా...?

చెలి : కాదా మరి? నోరార 'చెలీ!' అని పిలుతువు...కాని, మనసార నేమియు పలుకవు.

పేరిం : ...అది కాదే...! వారు......

చెలి : అందుకనే నమ్మా......!

పేరిం : (లజ్జతో)...ఆత్మ గౌరవమునకై ఆలినిగూడ త్యజించుట యెంతటి త్యాగమో నీ కేమి తెలియునే...!

చెలి: అబ్బ...! యిదియా...! ఐన...?

పేరిం: ...వారి హృదయ మెంతటి మధురమే...!

చెలి: ...నా కేమి తెలియునమ్మా? పుష్పమునందు గల మధువును గ్రహింప తేటి కానేగాని కీచురాల కేమగునమ్మా!

పేరిం: అట్టి పోలిక దేనికే...? చూడు...! నాయనగారు వారి నెట్లు సత్కరించియుందురే...!

చెలి: సందియ మేలనమ్మా...! మామ అల్లు నెవ్విధి గౌరవించునో అటులనే గదా!

పేరిం: అది కాదే...! నాయనగారు సహజముగ కోమలహృదయు లేనే...? కాని......

చెలి: ...కాని...?

పేరిం: వారికి స్వతంత్రత లేదనియే గదా మన విచారము!

చెలి: (తల వాల్చికొనును.)

పేరిం: నాయకురాలి తత్త్వము నీకు తెలియని దటే చెల్లీ...!

చెలి: ఐన...?

పేరిం: ఆమె వారి సంధిప్రయత్నముల కెట్టి యాటంకమును కల్గిం చునో యని!

చెలి: అదేమి టమ్మా? వారి రాయబారమునకును యిచటకు వచ్చు టకును సంబంధమును కలుపుచున్నావు?

పేరిం: ఔనే...! చూచితివి కదా... తొలుదొల్తనే వారు సభాంగ ణమునకు పోవుట...!

చెలి: ఎదియో అత్యవసరకార్యార్థము వచ్చితిరి గదా! అది ముగించి కొని యిటకు రావచ్చు ననుకొని యుందురు. ఇందు విపరీత మేమున్న దమ్మా...?

పేరిం: ...(నిట్టూర్చి)... నీకు తెలియదే చెల్లీ! కార్యసానుకూలత చూచికొననిదే వా రన్యము నాలోచింతురటే...!

చెలి: ('అట్లనా?' అన్నట్లు చూచును)

పేరిం : నాయకురాలి పన్నాగముల జిక్కుకొందు రేమో నని...

చెలి : ఆ ప్రియత్న మెట్లున్నను నీకు దర్శనము నీక మరలిపోదు రను కొందువా, అక్కా....?

పేరిం : ......స్వాభిమానము కలవారు గదే...!

చెలి : ......ఐన...?

పేరిం : (చకితయై) ...చెలీ...!

చెలి : (అత్రిముతో) ...ఏ మమ్మా...!

పేరిం : ......దక్షిణనేత్రి మదరుచున్న దే......!

చెలి : భ్రమించుచున్నా వమ్మా...!

పేరిం : (చెలి చేతులను తన గుండెమీద అన్చి) చూచితివా......హృదయ మెంత వేగముగ కొట్టికొనుచున్నదో...!

చెలి : భ్రమ భీరుత్వలక్షణ మని తెలియ వటమ్మా...!

పేరిం : ...కా దే...! (త త్తరమున)...చెలీ......ఆ వీణారవ మెచ్చ టిదే...? (అటూ యిటూ వెఱ్ఱిగ చూచును.)

చెలి : ఆస్థానగాయకురాలు మోగించుచున్నదమ్మా...!

పేరిం : (వెఱ్ఱిగ నవ్వుతూ)...ఆ...అపశ్రుతి...?

చెలి : అదేమిటక్కా! నీపలుకు లన్నియు వింతగ నున్న వే!

(పేరిందేవిలో అశాంతి ప్రబలమైన కొలదియు స్పృహ తప్పుచుండును. ఆమె యెదియో భయమును పొందుచున్న దానివలె త త్తరమున తిరుగుచుండును. ఆమె ప్రక్కగనే చెలి నడయాడుచుండును.)

పేరి : ...చెలీ...! చెలీ...!! ఆ...!!! చెలీ...!!! (పడిపోబోవును.)

చెలి : అక్కా...! అక్కా...! (ఆమెను పట్టుకొనును.)

(యవనిక పతనము)

## తొమ్మిదవ రంగము

[నరసింహు డాత్రమున నటునిటు తిలకించుచుండ నాయకురాలు ప్రవేశించును.]

నర : నాగమ్మా...! నాగమ్మా...!!

నాయ : ఉస్...! (దగ్గరగ చేరి) ఎంతవర కైనది...?

నర : అతడు తెచ్చికొనిన మధువునందే విసమును కల్పించితిని; ఆత డది కొద్దిగ త్రావి మిగిలినది ఉమిసినాడట.

నాయ : ఒక గ్రుక్కెడైనను గొంతు దిగియుండదా...!

నర : ...ఏమో...!

నాయ : ఆఁ...తరువాత...?

నర : అన్నియును ముందుగనే సరిచూచి వచ్చితిని. దారిలోని మన సత్రములయందలి పాత్రతపనివారల నెల్లరఁ దొలగించి క్రొత్తవంట వారినే నియమించినాను.

నాయ : నే నిచ్చిన పదార్థముల నుపయోగించు విధానమును వారికి బాగుగ చెప్పితివా ?

నర : ఆఁ...చెప్పితిని.

నాయ : ఐన...తదుపరి...?

నర : ఆ నీ యిచ్చిన సర్పముచే కొలదిగ మత్తుపదార్థముల దినిపించి పాలకి నాలుగైదు క్రోసులు పోవువరకు కదలకుండునట్లు కట్టు దిట్టముజేసి యం దొక రహస్యప్రదేశమున వదలినాను.

నాయ : (సంతోషమున) సరి; ఇక భయ మేమున్నదోయీ ? ఐనను నీ యీ కలవరమును లోకపుకంట బడనీరాదు సుమా !

నర : ఆఁ...! కాదా మరి...?

(నాయకురా లతనిని వెళ్ళిపొమ్మని సైగచేయును. అత డటులనే వెళ్ళిపోవును. నాగమ్మ వికటముగ నొక పెద్ద నవ్వు నవ్వి నిష్క్రమించును.)

యవనిక పతనము.

## పదియవరంగము

(మాంచాల శయనాగారమున బాలచంద్రుడు నిలువుటద్దమున కెదురుగ నిలబడియుండును.)

బాలుడు: ...బాలచంద్రా! చేతగల ఖర్జూరమును గ్రహింపక యెంత కాల మని కుంకుళ్లను కొఱికినా వోయీ! నేటికైనను దైవకృప నీయం దున్నది, కానిచో నింకెంత కాలము కన్నులు కలిగియు కాంచనోచనివాడవై యుందువోగదా! ఉఁహుఁ...! అపారమైన నీ భోగపారావారమునకు ఆ వైశ్యాంగనాదూషణమే కదా అవధి యైనది.

(మాంచాల పళ్లెరమున పాలనూ, ఫలములనూ గొని తెచ్చును. బాలు ఆమె నద్దముననే చూచి, అటుగా తిరిగి)

బాలు: ...దేవీ...!

మాంచా: ఏమి ఆజ్ఞ ప్రభూ!

(ఆమె ఫలాహారములను బల్లపై నుంచును.)

బాలు: (ఆమె చేతులను పట్టుకొని) ... నీ మృదుకరముల నిట్లు కమలిపో నలిపితి వేల దేవీ...!

మాంచా: (సిగ్గునూ వినయమునూ సూచించుచూ) లేదు ప్రభూ! మీకు నా యందు గల యనురాగమే య ట్లనిపించినది.

బాలు: (దగ్గర కామెను తీసికొని కన్నులలో కన్నుల జొన్పి) ...నీ దర్శన భాగ్యము నీవరకే నా కేల కలిగింప వైతివి దేవీ...?

మాంచా: ...దైవనిర్ణయమును ధిక్కరింపగలమా ప్రభూ!

బాలు: నీయెడ నింతటి యపచార మొనర్చిన నాపై నీ కేల కినుక జనింపలేదో...!

మాంచా: దైవకృప, ప్రభూ!

(బాలుడు నవ్వుకొనును)

బాలు: నీ నయనాంతర్గతదివ్యజ్యోతి నన్ను బహుధా ఆవరించు చున్నది. దేవీ...!

(మాంచాల అతని కరములు వ్రాలును. బాలు ఆమెను చేతులమీదనే ఆసనమున చేర్చి తొడలపై పరుండబెట్టుకొనును.)

మాంచా : ...ప్రభూ...?

బాలు : (పరాకును కనబడనీక)...ఏమి దేవీ...!

మాంచా : తమ మనోభావము లే యే దివ్యభూముల విహరించు చున్నవో...?

బాలు : అన్య మేమియు కాదు దేవీ...!

మాంచా : ఐన నీ దాసురా లది తెలిసికొనవచ్చునేమో...!

బాలు : ...పూర్వస్మృతి పరితాపము నొడగూర్చుచున్నది దేవీ... అదియే...!

(మాంచాల లేవబోగా బాలుఁ డామెను దగ్గరగ హత్తుకొనును.)

మాంచా : (దీనముగ) ఈ జడురాలికి ప్రాయశ్చిత్త మెద్ది ప్రభూ!

బాలు : ...ఏమి...? దేవి భ్రమించుచున్నదా ?

మాంచా : ఈ దురదృష్టజీవిని కలిసికొనుట చేతనేగదా మీకాస్మృతి కలిగి బాధ పెట్టినది ప్రభూ !

బాలు : అది యేమి...? ఒకరి పాపమున కింకొకరికా ప్రాయశ్చిత్తము!

మాంచా : నేను మీ అర్ధాంగినే కదా ప్రభూ !

బాలు : కా దనుట కూడనా...!

మాంచా : ఐన శిక్షింపుడు ప్రభూ! దాన మీకు కొలదిగనైన శాంతి చేకురునేమో !

బాలు : దేవి పరిహాస మాడుచున్నదా...!

మాంచా : అంతటి యదృష్టము కూడనా ప్రభూ !

బాలు : (సిగ్గుతో)... దేవీ...!

మాంచా : (తలయెత్తి వాని కన్నులలోనికి చూచుచుండును.)

బాలు : ...శిక్షించి తీరవలసిన దేనా...!

మాంచా : ('ఔ' నన్నట్లుగా చూచును.)

బాలు : శిక్షావిధాన మెట్లుండవలెనో...?

మాంచా : అమాత్యపుత్రుల కాదుమదియూ చెప్పగలదు ప్రభూ !

బాలు : (కలవరపాటునంది)...ఏమంటివి మాంచాలా......? ఇపుడు నీ పలికినదేమి...?

మాంచా : అది యేమి ప్రభూ! ఏమైన నపచార మొనర్చితినా...!

బాలు : కాదు మాంచాలా...కాదు...!

(ఆమెను విడిచి త త్తరమున లేచి నిలబడును.)

మాంచా : (భీతిల్లి) నావలుకుల దోసమున్న నీనాల్క నిప్పుడే చీల్చి వేతును ప్రభూ. మీకీ అశాంతి యేల !

బాలు : (స్వస్థత నంది)...దేవీ...!

మాంచా : (అతనిని చేరి) ఆజ్ఞ ప్రభూ...!

బాలు : (ఆమె నదిమి పట్టుకుని)...నీ సుకుమారహృదయమును నొవ్వ చేసితిని దేవీ!

మాంచా : ఆ సహింపరాని మాటను మరల్చుకొనుడు ప్రభూ...!

బాలు : (చిర్నగవున) శాంతింపుము మాంచాలా...! శాంతింపుము !

మాంచా : కరుణింపబడితినా ప్రభూ ?

బాలు : నాకలవరమునకు కారణము జెప్పుదునా దేవీ...!

మాంచా : (అతనివంక లిప్తకాలము చూచి, కనులు మూసికొని, చకితయై)... వలదు...వలదు ప్రభూ! ఆ ఘోరవిశేషమును తిరిగి మీస్ఫురణకు రానీయవలదు.

బాలు: (చిరునవ్వుతో)...దేవి గ్రహించినదికావలె !

మాంచా : తమ అనుగ్రహామువనే ప్రభూ !

బాలు : మరచితిని దేవీ...! మాతృశ్రీ తెలిపినదికదా నీకు దేవీ సాక్షాత్కారము కలదని?

మాంచా : కించిద్జ్ఞురాలి యెడ నింతటి యభిమానమా ప్రభూ !

బాలు : దేవీ...ఐన నిక శిక్షావిధానము నాలోచింతునా!

(అతని వంకనే మాంచాల చూచుచుండును.)

బాలు : ఆఁ...! తెలిసినది. నిన్ను బంధించుట ప్రథమము.

(ఆమెను హృదయమునకు హత్తుకొనును.)

లే గులాబీచుబుకము నెఱ్ఱవాఱి చేయుట రెండవది.
(మాంచాల కీగ్రంట సాతని తిలకించుచుండును.)
నీ యీ దివ్య స్వరూపమునకు...
మాంచా : చలో క్తియా ప్రభూ!
బాలు : (చిలిపిగ)...కాదే...!
(ఇరువురును నవ్వుకొందురు)

యవనిక పతనము.

## పదకొండవ రంగము

[నలగాముని విలాసభవనమున నాయకురాలు చికాకుగ తిరుగాడుచుండును. ఒక ఆసనము నానుకొని పేరిందేవి నిలబడియుండును.]

పేరిం : ...ఐన నా విన్న దంతయు కల్లయే యగునా!
నాయ : ఆ మాట నీ కావార్త తెల్పినవారినే యడిగిన బాగుండెడిది.
పేరిం : పోనీ...నీకు తెలిసిన విషయమునేని వెలిబుచ్చరాదా?
(అంతలో ఒక 'మల్లు' ప్రవేశించును. అతడు పేరిందేవిని గమనించడు.)
మల్లు : (తొందరలో)...మహామంత్రిణికి జయము...!
నాయ : (అతనిని చూచి, కలత నంది, గంభీరముగ) ఎవ రది...?
మల్లు : నేనే...! మల్లును తల్లీ...!
నాయ : ...మల్లూ...! నీవా...! ఆఁ...! పనిపూర్తియైనదికదా... యిక నీకు సెలవైనది.
మల్లు : (వెళ్ళుటకును, వెళ్ళకుండుటకును తోచక నిలబడియుండును.)
పేరిం : (ఆ యిరువురి ముఖములలోని కలవరమును తిలకించుచూ) ...నాగమ్మా! సమాధానమును వినకుండనే సెలవిచ్చుచుంటి వేల?
(నాయకురా లా మాటను వినిపించుకొనక తిరుగ నారంభించును.)
పేరిం : (మల్లు దిక్కై)...మల్లూ...!
మల్లు : ...ఏమి ఆజ్ఞ దొరసానీ...!
నాయ : మల్లూ...! నామాటలు నీచెవులకు వినబడుటలేదా!
(మల్లు పోబోవుచు నిలబడి భయపడుచుండును.)

పేరిం : ...మాట్లాడవేమిరా ?

మల్లు : ...చి త్తము...!

నాయ : మల్లూ...! వృథగా కాలయాపన చేయుచున్నావు.

పేరిం : ...నాగమ్మా...!

నాయ : (నిర్లక్ష్యముగ మల్లువంక చూచి పొమ్మని సైగ చేయును.)

పేరిం : (తీవ్రముగ) మల్లూ...! సమాధానము...!

మల్లు :...అమ్మా...! అపరాధిని...!

నాయ : (బిగ్గరగ) మల్లూ...! గడువు దాటిపోవు చున్నది సుమా! ఇకపై పశ్చాత్తాపపడిన ఫలము లభింపదేమో !

(మల్లు నిర్విణ్ణుడై యుండును.)

పేరిం : (ఒరనుండి కత్తిని దూసి) మల్లూ...యిక నీవు పలుకకున్న రాజద్రోహి వౌదువు సుమా ?

మల్లు : (వణకుతూ)...అ...ల...రాజు...లుంగా...రు...

పేరిం: ఆఁ...! ఏమైనారురా...?

నాయ : మల్లూ...! నీ నోటికి తాళము వేసికొనవలసినదిగా మహా మంత్రిణి ఆజ్ఞాపించుచున్నది.

(మల్లు నోరు మూసుకొనును.)

పేరిం : మల్లూ...! ఇక నీవు పలుకకున్న యీ చురకత్తి నీహృదయమున జొచ్చుకుపోయి ఆ రహస్యమును బయల్పెట్టగలదు సుమా !

(నాయకురాలు తలవాల్చుకొనును.)

పేరిం : (నాయకురాలివంక గంభీరముగ చూచి తిరిగి మల్లు దిక్కై) మల్లూ...! ఈ ఆజ్ఞాపించునది రాకుమారి; తెలిసినదా?

మల్లు : అపరాధిని దేవీ...!

నాయ : (రౌద్రముతో ఒరనుండి కత్తిని తీసి అతనిపై విసరుచూ)...మల్లూ...!

(ఆ కత్తి వాని కంఠమును దూసుకుపోవును. వా డరచుచు నేల గూలును.)

పేరిం : (నాయకురాలిదిక్కై గంభీరముగ చూచుచు) రాక్షసీ!నీలోదాచికొనిన రహస్యమును యీ నీఘోరకార్యము విప్పిచెప్పినదని యెరుంగవటే!

(నాగమ్మ మౌనముగ పచార్లు చేయుచుండును. అంతలో నలగాముడు ప్రవేశించును. అతడు వచ్చుచు మల్లును చూచి, చకితుడై, నాగమువంక చూపు నిల్పి)

నలగాముడు : ...నాగమ్మా...! యిదేటి ఘోరము !

(నాగమ్మ మాట్లాడదు.)

పేరిం : (గంభీరముగ తండ్రివంక చూపు నిగిడ్చి) ఈ వచ్చినది నిష్కారణముగ అల్లుని చంపికొనిన అపకీర్తివుడేనా...!

నల : (చకితుడై) నీవా... పేరిందేవీ...! ఏమి యీ కల్లోలము...?

(నాయకురాలు వికటముగ నవ్వును)

పేరిం : కన్న కూతునకు పతివియోగవ్యథను కూర్చిన నృపసింహుని కీ కల్లోలమును గ్రహించునంతటి యింద్రియచైతన్యముకూడకలదా!

నల : నాగమ్మా...? నీవైనను వివరించి చెప్పుదువా?

నాయ : (వికటముగ) మానవుల కోర్కెలను మానవమాంతకురాలు ...రక్కసి...ఎట్లు తీర్పగలదు ప్రభూ!

నల : (పేరిందేవి దిక్కై) పేరిందేవీ... మీ సంభాషణల సముఖమున న న్నొక అజ్ఞానిని చేసినారే...!

పేరిం : ...పాషాణమునకు కర్కశత్వము నొకరు కల్పించుటకూడనా మహారాజా...!

నల : (దీనముగ) కుమారీ...! నీతో పల్కుచున్నది మీ నాయన నలగాముడు సుమా !

(అంతదనుక గంభీరముగ నున్న పేరిందేవి ఆ మాటలు విని విచారమును పట్టలేక రోదించును)

నల : (కన్ను లద్దికొనుచూ) అమ్మా......! నీ కిట్టి మనోవ్యాకులత చేకూర్చిన పిశాచ మెవరో చెప్పుదువా...?

పేరిం : (దుఃఖము నాపుకుని) తండ్రీ...! నాపై నొట్టు పెట్టుకుని చెప్పుము. నీ అల్లుని మరణోదంతము నీ కేమియు తెలియదా?

నల : అది యేమి తల్లీ ..! అలరాజు మరణించెనా...! ఎవరు చెప్పిరి?

నాయ : ఊఁహుఁ...! ఊరంతయు నోరుగ ఆమాటనే మోగియుచున్నదట.

నల : (పేరిందేవి దిక్కై)...అమ్మా...!

పేరిం : (ఏడ్చుచూ)...తండ్రీ...!

నల : ఆ అమంగళశబ్దోచ్చారణ మొనర్చిన గొంతును త్రుంపివేసె దను తల్లీ...! ఆ చెప్పిన దెవరు ?

నాయ : (వికటముగ) ఊహూఁ...! అంతటి యభిమానము నాయకు రాలికికూడ కలదని నిరూపించుటచేతనే యీ మల్లున కిట్టి గతి పట్టినది ప్రభూ!

నల : (విచారమును దిగమ్రింగికొనుచూ) శ్రీహరీ! ఎంతటి అవాచ్యము...! ఎంతటి దారుణము...!

పేరిం : (నాగమ్మవంక చూచి, లోని క్రోధము నెల్ల లోననే దాచికొనుచూ)

తండ్రీ...! నీకూతు రొనర్చు యీ కడసారి వందనము నంది కొందువా! (నమస్కరించును.)

నల : (విచారమున) ఇకపై కనబడనంతటి అవస్థకు కారణ మేమి తల్లీ...!

పేరిం : ఉచితానుచితజ్ఞానవిరహిత మగు మీ అభిమాన మత్తగజ పాదఘట్టనల నీ యల్పప్రాణి యింకను నలిగిపోవుటకు వీలు లేదు తండ్రీ!

నల : నా హృదయము నింకను వ్రయ్యలు చేయనెంచితివా, అమ్మా!

పేరిం : (వికటముగ) నాయనా ! హృదయమే కలదేని యీవరకే వ్రయ్యలై యుండవలసినదికదా !

నల : (విచారముతో) నీ దివ్యస్వరూపము సైతము నానుండి వేరు గావలసిన దేనా...తల్లీ!

పేరిం : ఎంతటి అమాయకుడవు తండ్రీ ! నా దివ్యత్వము మాసిపోయిన దనియేకదా యీ విచారము!

నల : ఐన...ఏమి చేయనెంచితి వమ్మా...!

పేరిం : (సగర్వముగ) ఆదర్శహైందవాంగనవలె పతిగూడి సహగమ నము చేయనెంచితిని తండ్రీ! ఆలసించిన ఆశయసిద్ధికి దూరమాదును గదా !

(కేలోడ్చి)...తండ్రీ...సెలవా...!

నల : (పిచ్చిగా)...అమ్మా...! అమ్మా!! అమ్మా !!!

పేరిం : (పోబోవుచు, నాయకురాలి దిక్కై) శక్తిస్వరూపిణీ! నా అనుంగు పతిని నిష్కారణముగ పొట్టబెట్టుకుంటివిగదా! నేటినుండియు నా నీడనైనను నీకు కనబడబోదుగదా! ఇక పైనైన నీకు శాంతి చేకూరునా...! కానిమ్ము! నాకంటె పెద్దవుగదా ... ఈ తుది ముహూర్తమున నైన నన్నాశీర్వదించి పున్నెము కట్టుకొందువా!

నాయ : (వికటముగ) ఉఃహుః...! పిశాచి...ఆశీర్వదించుట...!!

పేరిం : అమ్మా...సెలవు...! (పోవును.)

నల : (పిచ్చిగా) అలరాజు మృతియా...! అనుంగుపుత్రి సహగమనమా...! ఈ నలగాము డింక నడుపీనుగయేగదా...!గురిజాల దేవత కీనాటి కిట్టి విపరీతపు కోర్కెలా...! బిడ్డా...! బిడ్డా...!! బిడ్డా...!!!

(పడిపోవును. నాయకురాలు వికటముగ నవ్వును.)

యవనిక పతనము.

## పదమూడవ రంగము

[కొమ్మరాజు తన గదిలో ఆలోచనా నిమగ్నుడై తిరుగాడుచుండును. అతని మోమున విచారపరంపరలు నాట్యమాడుచుండును. అప్పుడప్పుడతడు కన్నీటిని రాల్చుచుండును; గంభీరముగనే యుండును.

కొమ్మరాజు : ధన్యుడవుగదా కుమారా! ఇంతటి పిన్నవయసుననే నీ కింతటి మహాద్భాగ్యము లభించినదోయీ! నీ వీరరసోచిత మగు ఉదారాశయముల మూలముననే కదా నాయకురాలి నాస్తికత్వమును, నలగామునిబానిసత్వమును వెలుగుచూచినవి. కాని, యెంతటి దారుణకృత్యమునకు బలియైనావోయీ! నాహృదయమున నెంతటి ఆరని మంటను కల్పించినదోయీ; ఆ నరహంతకి! ...ఉఃహుః...! నా చిట్టితండ్రిని రాయబారిగ నాటికి విడిచిపుచ్చి రణరంగమున యోధురాలివలె యెదుర్కొనుట కామెకు ధైర్యము చాలినది కాదుకదా! ఔను, లోని కుటిలత్వపు టగ్గి పర్వత మేనాడైనను బ్రద్దలు కావలసినదే కదా!

బ్రహ్మనన్న : (పరికించి విచారముతో)...బావా...!

కొమ్మ : (ఆనందముతో కూడిన విచారముతో) ...బ్రిహ్మన్నా.........
నీ తుదిదీవన బిడ్డనియెడ యినుమడించి ఫలించినదోయీ! మాచర్ల మండలమేకాదు మహీమండల మంతయు నాకొమరుని యశోగీతి నింక వేనోళుల నాలపించును గదోయీ!

బ్రహ్మ : (తల వాల్చుకొనియే యుండును)

కొమ్మ : (సగర్వముగ) బావా! కొమ్మరాజునకు వృద్ధాప్యమున భీతి యావహించిన దంటివే; యీ నీ ఐహికసంబంధములపై ఆస దట్ట మగుటకు కారణము...?

బ్రహ్మ : నా విచార మూతడు మడిసె నని కాదోయీ...అట్టి రాజ సేవకుడు రాయబారి కనర్హ మగు మృతికి పాల్పడినాడే యని.

కొమ్మ : అది విచారించుటవలనిఫలము... ?

(మలిదేవుడు ప్రవేశించును. కొమ్మరాజాదులు గ్రహింపరు)

మలి : ఏ మున్నది...? ఇకపై నైనను అట్టి అవివేకపుకార్యాచరణ కుద్యుక్తుడవు కాకుమా యని మలిదేవుడు తనకు తానే మంద లించుకొనుట.

(కొమ్మరాజూ, బ్రిహ్మన్నా మలిదేవుని చూతురు)

మలి : సర్వసైన్యాధ్యక్షునకు మలిదేవుడు సానుభూతిని తెలుపుకొను చున్నాడు.

కొమ్మ : ...కృతజ్ఞుడను ప్రభూ! కాని, తమ్ము తాము మందలించుకొన వలెనని బాధపడుటమాత్రము సహింపరానిది.

మలి : ఏమి...? నా దోసమున కీ ప్రిపంచమున శిక్ష విధించుకొనుట తగదా ?

కొమ్మ : ...లేనిదోసము నారోపించుకొనుచున్నారు ప్రభూ!

మలి : నాయకురాలు నరరూప రాక్షసి యని తెలిసియు అలరాజు నామె యెదుట నిలుపుట నా అవివేకము గాదా బ్రహ్మన్నా...!

బ్రహ్మ : అది దోస మె వ్విధి గాగలదు నాయనా! మర్త్యరూపధారి యగు మహావిష్ణువునకైన నిట్టివి తప్పవుకదా!

(మలిదేవుడు తలవాల్చుకొనును. కొమ్మరాజు మందహాసము చేయును)

(ఒక వార్తాహరుడు ప్రవేశించును.)

వార్తా : జయము...జయము...శ్రీ శ్రీ కొమ్మనృపాలునకు జయము!

కొమ్మ : (నిట్టూర్చి) ఈ సమయమున కొమ్మరాజునకు జయము పలుకు నీ వెవ్వడ వోయీ!

వార్తా : శ్రీ శ్రీ పేరిందేవి దొరసానులుంగారి పాలకి మోయు మీ పాదధూళిని ప్రభూ!

(బ్రహ్మన్న మలిదేవునివంక అర్థవంతముగ చూచును)

కొమ్మ : (శిరమును వంచికొని) ఆఁ...విశేషములు...?

వార్తా : ఊరి కామడన్నర దూరమున శ్రీ శ్రీ అలరాజులుంగారి పాలకి ఆగిన ప్రదేశముననే శ్రీ శ్రీ పేరిందేవి దొరసానులుంగారి పాలకియు నిలచియున్నది ప్రభూ ! తత్‌క్షణమే అచట నొకచితి నేర్పరుప వలసినదిగను, వారికి సహగమనార్థము అనుజ్ఞ నొసంగి సన్నాహముల నెల్ల చేయింపవలసినదిగను మిమ్ము కోరి రమ్మనినారు దొరా?

(కొమ్మరాజు కంట నీర్వెట్టును. బ్రహ్మన్న శిరము వాల్చును.)

మలి : బ్రహ్మన్నా...నీ వచన మమోఘము సుమా!

(కొమ్మరాజు మలిదేవునివంక దీనముగ చూచును.)

బ్రహ్మ : బావా...దీనికి తగు సన్నాహము లన్నియు త్వరలోనే జరుగగలవనియు, అత డా స్థలమును తిరిగి చేరులోపలనే మన మచట నుండగల మనియు తెల్పి యతనికి సెలవు చెప్పుదుమా!

(మిక్కిలిగ శోధించుచు కొమ్మరాజు వార్తాహరుని వైపు సార్థకముగ చూచును. వార్తాహరుడు వెనుకకు అడుగులు వేసికొనుచూ వెడలిపోవును.)

మలి : ఎవ రక్కడ...?

భటుడు : ఆజ్ఞ ప్రభూ...!

మలి : మా కొరకై పూన్చిన రథము సిద్ధముగ నున్నదా!

భటుడు : చిత్తము ప్రభూ!

(మలిదేవుడు బ్రహ్మన్నవంక చూచును)

బ్రహ్మ : (కొమ్మరాజు దిక్కై)...బావా...!

కొమ్మ : (అంతవరకును పరధ్యానముగ నుండి, తెప్పరిలి)...ఇంకను యిచ్చటనే యుంటిమా బ్రహ్మన్నా...!

(మలిదేవు డేదియో యోజించుచు దారి తీయును. ఇతరు లనుసరింతురు.)

యవనికా పతనము.

---

## మొదటి రంగము

[బాలుని తమ్ము లేడ్గురను గందువారి యింటిముందు గర్జించుచుందురు.]

అనపోతు : విరిగిపోయిన పాలకు వెలగట్టవచ్చునా చందూ...!

(చందు తమ్ములవంక చూచును. అందరను విరగబడి నవ్వుదురు.)

చందు : ఆ దోసమును పాల కెవ్వేథి నాపాదింతు వన్నా!

అన : తమ్ముడూ! నీమాట నెందులకు కాదనవలె? గర్భిణీమేఘము లచే నావరింపబడిన చందమామపలనిలాభము ప్రపంచమున కేమైన కలదేమో నీవే చెప్పుము?

(చందు తల వాల్చుకొనును. బాలురు నవ్వుదురు. ఎవరో ప్రవేశించుచున్న శబ్దము కాగా అనపోతు వారల నపవారించును. చేటి ప్రవేశించుట చూచి వారందరును కకపక నవ్వుదురు. ఆమె నమస్కరింపగా వారు స్వీకరింతురు.)

చేటి : (బాలుర దిక్కై) మీరాకకు గల కారణమును అన్నగా రడిగి రమ్మనినా రని చేటి విన్నవించుకొనుచున్నది.

(బాలు రందరూ అనపోతువంక చూతురు. అతనినే మాట్లాడుమని కనుసైగ ద్వారా తెల్పుదురు.)

అన : చేటీ...!అన్నగారి మన స్తత్వమును అనుజు లందరూ ప్రశ్నించినా రని విన్నవింతువా!

చేటి : చిత్తము. (వెడలును)

చందు : అన్నా...!నీవు పాముతో చెలగాట మాడుచున్నావోయీ!

అన : (నవ్వి) పిచ్చివాడ ననుకొంటివా తమ్ముడూ! అది యిప్పుడు మత్తిలియున్నదని తెలియునా...!

(బాలు రందరూ విరగబడి నవ్వుదురు.)

చందు : తెలివి గలిగిన నది యేమి చేయునో చెప్పవలయునా అన్నా...

అన : (చిరునవ్వుతో) మంత్రగాని కది తెలియనిదా తమ్ముడూ...?

(బాలురు మరల నవ్వుదురు. చేటి తిరిగి రాగనే అందరూ నిశ్శబ్దముగ నుందురు)

అన : చేటీ! బాలచంద్రుడు లేమనినారు...!

చేటి : (భయముతో) అన్నను ప్రశ్నించు నధికారము తమ్ములకు గలదా యని మిమ్ములనే అడుగు మనినారు, గురూ!

అన : (చందుతో) వింటివా చందూ?!

(బాలురు గంభీరముగా చూచుచుందురు)

చేటి : ఏమి సెలవు...?

అన : చేటీ...ఎట్టి జాతిరత్నమున కైనను సానబెట్టుట తప్పనిసరి యని నా మాటలుగ వారికి నివేదింతువా!

(బాలురు భీతిలి నట్లుందురు)

చేటి వెళ్ళిపోవును.

చందు : (అనపోతుతో) అన్నా...!

అన : ఏమి తమ్ముడూ...!

చందు : క్రౌంచమిథునమును వేర్పరచిన కిరాతుని గాథ నీకు తెలియును గదా!

అన : (నవ్వి) అదియేకాదు, ఆ కిరాతుడు మడియుటయే ఆదికవికి అక్షరభిక్ష నిడిన దని కూడా యెఱుంగుదును.

(చందు తలవాల్చుకొనును. బాలు రందరు గంభీరముగ చూచుచుందురు. బాలుడు కత్తి పట్టుకొని ప్రవేశించును. బాలు రందరును పకపక నవ్వుదురు.)

బాలుడు : రత్నమునకు సానబెట్టుట యెటువంటిదో మత్తగజముల కంకుశపు పోటునను నట్టిదియే కదా?

అన : (తమ్ములవంక చూచి) తమ్ములారా! అన్నగారిమాటలు మీ కర్థము కాలేదా?

(తమ్ము లందరూ అతని దిక్కే చూచుచుందురు. బాలుడు ప్రళయకాల రుద్రునివలె నిలబడియుండును.

అన : అంకుశము త్రుప్పుపట్టనిదేయైన వారి భావమును సరియైనదే నని చెప్ప నేల?

(బాలురందరు నవ్వుదురు. బాలుడు తల వాల్చుకొనును)

అన : అంతగ నవ్వుదు రేల నయ్యా! అతడు కత్తిబట్టి బయటకు వచ్చినంతనే తమ్ములపై సమరము సలుపు మూర్ఖు డనియా మీరు

తలంచితిరి! బాలవీరుల ప్రతాపానలము కాలవాహిని గలిసిపోవు నని, బాలచంద్రహరీంద్రము భోగగజేంద్రమునకు జోహారు లొనర్చు నని బ్రహ్మనాయుని ఆశయచంద్రికలు భావజలదములలో మటు మాయమౌనని, వేయేల యీ మన పల్నాటిరక్తము శక్తివిహీనమై పోవునని తలంచిరే కదా, ఆ అలరాజ వీరగజకేసరి తన కదుష్ణరక్త ప్రవాహమును కదనోన్ముఖమైన ఆ గురిజాల పిశాచశ్రేణి కాహుతి చేసినది? ఆ వృత్తాంతము నీతడు మరచినా డనియా మీ భావము. పరమపతివ్రతా శిరోభూషణ మగు మన అక్క పేరిందేవి అల రాజుతో సహగమనము సలిపి స్త్రీయధర్మమును వెరవేర్చుకొనిన దీతఁడు విస్మరించె ననియా మీ ఉద్దేశము? బ్రహ్మనాయుఁడా అలరాజు మృతికి ప్రతీకారము చేయగల సమర్థు డీతడే యని కొమ్మ రాజునకు శాంతి చేకూర్ప నితని నిల్లడచేసినది మరచినా డనియా మీ ఆవేశము? మలిదేవభూజాని పంపిన ఖేతాళనామక ఖడ్గరాజ మునకు మన్నన చెడిపోయిన దనియా మీ విచారము! (వికట ముగ) ఏమి యీ అపహాస్యము! ఇట్టి యోధుని చూచియా మీ పకపకలు...!

(బాలు రందరూ ఫక్కున నవ్వుదురు. బాలు డది యంతయు విని, తల వాల్చి అటులనే యింటిలోనికి చెరచెర పోనుండును.)

అన : ...అన్నా!

(బాలు డాగును.)

అన : కులపగ తీర్ప నీతో ప్రతినబట్టిన మాకైనను కార్యోన్ముఖుల మాట కనుజ్ఞ నిత్తువా...!

(కొలదిగ ఆగి బాలుడు కదలిపోవును.)

అన : చందూ...అగ్నిముఖమున బడిన గాని పైడికి మేలిమి బైట పడదని తెలిసికొంటివా...!

(బాలు రందరూ గంభీరముగ చూచుచుందురు. అనపోతు వారలను అల్లరి చేయవలదని సైగలతో వారించి ఓ ప్రక్కకు తీసుకు పోవును.

యవనిక పతనము

## రెం డ వ రం గ ము

(మాంచాల శయనాగారమున భర్త్రకై నిరీక్షించుచుండును. ఏదియో చదువుచుండును)

మాం : గీ. కలిమి బోద్రోసి, సర్వసౌఖ్యముల రోసి,
పుడమి చేడియవలపు చూపులను గోసి,
కావిగుడ్డల దేలు బంగారు తండ్రి
కొమరుడా? కాదు, నిజము, మద్గురు డతండు.

(బాలుడు దీనవదనుడై ప్రవేశించును. మాంచాల పుస్తకమును మూసి అతని కనతి దూరమున నిలబడి సవినయముగ)

ఉపదేశమునంది వచ్చితిరా ప్రభూ?

(బాలుడు మౌనముగ నుండును. మాంచాల చిన్నవోవును.)

బాలు : (తెప్పరిలి వికాసవదనముతో) నీ అభీష్టము నదియే గదా! దేవీ...!

మాం : మీ హృదయమున కీ మాంచాల ప్రతిబింబమే కదా ప్రభూ!

(బాలుడు చిరునవ్వుతో ఆమెకు ఖడ్గమ్ము నందీయును. ఆమె సగర్వముగ దానిని స్వీకరించి, కనుల కద్దికొనును. బాలుడట్లే నిలబడియుండును.)

మాం : చెలీ...!

చెలి : అమ్మా...ఆజ్ఞ...!

మాం : హారతి పళ్ళెరము నిటు లందీయవే!

చెలి : సంతోష మమ్మా...! (వెడలును)

బాలు : ఆ, నీ, చదివెడి దేమి దేవీ...!

మాం : ఏదియో......!

బాలు : నాకు మాత్ర మది యానందము నొసంగదా దేవీ!...ఏది...? మరొకమా రది వినిపింపుము!

మాం : ఇయ్యది సుందరీనందుల శృంగారచరితము ప్రభూ!...విన నభిలషింతురా...!

బాలు : అవశ్యము.

మాం : "కలిమి పో ద్రోసి............
.........మద్గురు డతండు."

(తిరిగి చదువును.)

బాలు: ఏదీ...తదుపరి నేమనినాడు...!

మాం: గీ. బ్రతుకు బాటను ప్రణయపుష్పముల జల్లి
యామెకై తాను దనకు నా యమ యటంచు
దలచు నందుడు, నేడు సుందరిని మరచి
జోలి బట్టుట ధర్మముం జూపుగాదె...!

బాలు: దేవీ...! (ఆనందమున...) దేవీ...!! సుందరీనందు లెట్టి వారని చెప్పబడినది...?

మాం: (చిరునవ్వుతో)
గీ. వలపు నెల్లను పూవులపాన్పు చేసి
విందు వేడుక నందు క్రీడించు నామె
నందునిఁ గూడి; అతని యానందమునకు
మేర యుండదు; సుందరిఁ జేరి నంత.

బాలు: ఊహూ...! అట్టి దంపతులకా నన్యననము సిద్ధించుట దేవీ! అది యెల్ల ధర్మసంస్థాపనోద్దేశముతోడ నేగదా...!

మాం: చిత్తము ప్రభూ!
(చెలికత్తె హారతి పళ్లెరముతో ప్రవేశించును.)

చెలి: అక్కా...!
(మాంచాల వాని నందికొని, బాలునకు హారతి నిచ్చి కుంకుమ బెట్టును. ఖడ్గమును కండ్ల కద్దికొని అతని కరముల నుంచును. తిరిగి హారతి నీయును.)

మాం: ప్రభూ!

బాలు: ఏమి దేవీ...!

మాం: నా తుదికోర్కెను...

బాలు: అట్టి అమంగళము నేల ఉచ్చరింతువు దేవీ!

మాం: (లేనినవ్వును తెచ్చిపెట్టుకుని) అట్లేల తలంతురు ప్రభూ! విజయమునే సాధించి, కులపగ దీర్చికొని వత్తురేని నా కింక కొరత యన నుండదుకదా! కాదో, అమరధామమున మీతో శాంతిసౌఖ్యముల నందికొందును కదా. ఏ దైనను నా కీ లోకమున నిదియే కదా తుదికోరిక ప్రభూ!

బాలు : (చిరునవ్వుతో) దేవీ! నీ కోర్కెను తీర్చి పుచ్చగలడా యీ బాలచంద్రుడు.
మాం : అనుగ్రహింపబడితిని ప్రభూ!
బాలు : నీ యే కోర్కెను నేను తీర్చవలె దేవీ!
మాం : ధర్మచ్యుతి నందని దానినే ప్రభూ!
బాలు : అభిప్రాయము......?
మాం : భూసురుడగు అనపోతు మనకు గురుతుల్యుడుకదా ప్రభూ! అతనిని మీతో రణరంగమునకా తోడ్కొని పోదురు?
బాలు : అతడే నన్ను తోడ్కొని పోవుచున్నాడు దేవీ...!
మాం : మీ అభిమానమును శంకింపను ప్రభూ...! కాని......
బాలు : అదియేమి...?
మాం : అతని కెద్దియైన ఆపద వాటిల్లిన ఆపాపము మీదియౌ గదా యని...
బాలు : ఎట్లు కాగలదు...?
మాం : మీ పగ తీర్చుటకే గదా అతడు పయనించుట !
బాలు : వానికిని నాకును భేద మే మున్నది దేవీ...!
మాం : క్షమింపుడు ప్రభూ! అతడు మీకు సోదరతుల్యుడే కాని సోదరుడు కాడుగదా......
బాలు : ఐన......?
మాం : అట్టిచో ఆ దోసము తమకే...
బాలు : (ఆలోచించి) సరిగనే చెప్పితివి దేవీ ! ఐన...యేమిచేయ మందువు...!
మాం : ఎట్లయిన నాత డిటనే యుండునట్లుగ పలుకుట ఉత్తమము గదా ప్రభూ...!
బాలు : నీ కోరెడి దిదియే గదా దేవీ !
మాం : (చిరునవ్వుతో) ఈ మాత్రపు దోసముకూడ తమ్ము బాధింప రాదనియే యిట్లర్థించుచున్నాను ప్రభూ !
బాలు : ఐన...నాకింక యనుజ్ఞయా...!

(మాంచాల సంతోషమున నాతని కన్నులలోనికి చూచును.)

మోం : నా కోర్కెను మరవునకు రానీరు కదా ప్రభూ...!
బాలు : (అమితోత్సాహమున) అంతటి అపచారమా దేవీ...!

(బాలు డామెవంక చూచును. ఆమె నమస్కరించును. బాలుడు నిష్క్రమించును. ఆమె వానినే అనుసరించి ద్వారము వరకును బోవును.)

యవనిక పతనము

## మూ డ వ ర ం గ ము

[నలగాముని సభాభవనమున నృత్యము జరుగుచుండును. అతని కిరుపార్శ్వములను నరసింహ నాయకులాంధ్రాసీను లై యుందురు. సామంతప్రభువులూ, మంత్రులూ, కవులూ అచ్చటచ్చట ఉచితాసనముల నుపవిష్టులైయుందురు.]

నృత్యము :—

అష్టపది : చరణరణితమణినూపురయా పరిపూరిత సురతవితానమ్
ముఖరవిశృంఖల మేఖలయా సకచగ్రహచుంబనదానమ్
రతిసుఖసమయరసాలసయా దరముకుళితనయనసరోజమ్
నిస్సహనిపతితతనులతయా మధుసూదన ముదితమనోజమ్.

1 వ కవి : (నిలబడి)

గీ. సిరులఁజూచి కుబేరు డచ్చెరువు పడును
భోగములనెంచి విధియు నబ్బురముఁ జూపు
త్రిభువనమ్ములు నిన్ను గొల్చెడిని సతము
విమలగుణధామ! నలగామ!! విజితకామ!!!

(కరతాళధ్వనులు)

2వ కవి : గీ. నిన్ను గనినంత భీముడు చిన్నవోవు
సవ్యసాచియు నీ పరిచర్య సలుపు
పాదములఁబట్టుగా బలభద్రుఁడేని
శౌర్యజితభీమ! నలగామ సార్వభౌమ!!

నల : (సంతోషమున) నాగమాంబ! సభాస్తారుల కిక సెలవుచెప్పి ఆ భట్టున కాజ్ఞ దెల్పుదుమా...!

(నాగమ నరసింహునివంక చూచును.)

నర : (నిలబడి) నృత్యగాన కవిత్వాది విశేషముల కింతటితో స్వస్తి చెప్పి, రాచకార్యములయందు నిమగ్నులు కావలయునని రాజేంద్రులు కోరుచున్నారు.

సభ్యులందరూ :

(నిలబడి) జై...! నలగామ నృపేంద్రునకూ జై...!! సత్కళా విభవశోభితునకూ జై...!! రసికాగ్రేసర సార్వభౌమునకూ జై...!!!

(అందరూ నిష్క్రమింతురు)

నర : ...రాజా.....!

నల : ఏమి నరసింహా...!

నర : సంధిప్రయత్నములపై సంధిప్రయత్నముల చేయుచున్న ఆ బ్రహ్మనాయుని భావ మెద్దియో గ్రహించితిరా?

(నాగమ చిరునవ్వు)

నల : సమాధానము నొసంగుటకు నాయకురాలే సమర్థురాలేమో!

నాయ: (తలవాల్చుకుని, కృతజ్ఞత చూపి) ఏమున్నది మహారాజా...ఎదిరి బలమునకు తలయొగ్గవలయు ననెడి భీతియే యిందులకు మూలము.

నర : అట్టి భీతియే యున్నవారు కార్యమపూడికి చేరియుండరేమో...!

నాయ : కరవలేని కుక్క మొరుగుచు పైకి దుముకుట సహజమేకదా!

(నలగాముడు నవ్వును. భట్టు ప్రవేశించి నమస్కరింపగా నలగాముడు స్వీకరించును.)

భట్టు : ద్వి॥ మహారాజ! రారాజ! మార్తాండ తేజ!
ప్రథిత విక్రమకళా భరణ! భూరమణ!
సద్గుణస్తోమ! సంస్తవనీయ నామ!
సద్యశో విభవవిస్తార! ధీసార!

నాయ : ఉన్...! భట్టూ...! నీ పొట్టకూటి పొగడ్తల నింక కట్టిపెట్టి నీ వచ్చిన రాచకార్యమెద్దియో మనవిచేసికొందువా!

భట్టు : (అటుగా చూసి) ఓహో! స్త్రీత్వమునందును మగటిమిని చూపదలచిన మహామంత్రిణియా ఆజ్ఞాపించునది!

(నాయకురాలు నలగాముని వంక చూచును.)

నల : భట్టూ...ప్రథమకబళముననే మక్షికాపాతమైనది.

భట్టు : ప్రభూ ! మక్షికమునే మ్రింగజాలనివారు మత్తగజేంద్ర సింహాములకై నోరు తెరచుట భావ్యమా!

నర : (ఉగ్రుడై) భట్టూ...! వియ్యమునకు వచ్చి కయ్యమునకు దిగి నట్లున్నదినుమా నీ ప్రసంగము.

భట్టు : (అటు దిక్కై) ఎవరది......! (ఆశ్చర్యమున) అల్లు నన్యాయముగ రాజనీతి యనుకొని గరళము పాల్జేసిన నరసింహ భూజానియా...జోహారు!

నాయ : రాయబారివై బ్రతికిపోతివి భట్టూ! లేకున్న, నీ నాల్క యీవరకే యీవలకు పెకలింపఁబడి యుండెడిది సుమా...!

భట్టు : (వికటముగ నవ్వి) మహామంత్రిణీ! రాజేంద్రుని అల్లునకు లేని గౌరవమును సామాన్యు డగు రాయబారికి చూపుట గురిజాలవారి (ఆచారమా?)

(నలగాముడు తలవాల్చుకొనును. నాగమ్మ మండిపడును.)

నల : భట్టూ...! నలగామునితో ప్రసంగించుటకు గదా నీ విటకు వచ్చినది!

భట్టు : కాదు ప్రభూ!...రాజేంద్రునితో.

నల : ఆఁ...! ఏన...?

భట్టు : ఏమున్నది ప్రభూ! పానకమునందలి పుల్లలను త్రోసివేయక త్రాగుట దుర్లభము కదా!

నల : భట్టూ...! నీ విప్పుడు చుల్కన చేసినది మహామంత్రిణి నని యెరుంగుదువా!

భట్టు : (వికటముగ) మహామంత్రిణి ననియే కాదు, ఆమెచేతి కీలు బొమ్మ నని గూడ యెరుంగుదును.

నాయ : (కుపితయై) భట్టూ......!

నల : (లేచి నిల్చబడి) నాగమ్మా! పిచ్చుకపై ననా బ్రహ్మాస్త్రప్రయోగము...?

భట్టు : (నలగాముని దిక్కై) తన తలనే తాను దర్పణమున నరిగ

చూచికొనలేని యీ దినములలో విచ్చుకత్తులు పిచ్చుకలుగను, నిరన్నులు బ్రహ్మాస్త్రధారులుగను కనపడుట వింతయా ప్రభూ!

(నరసింహుడు వెలవెలబోవును.)

నల : భట్టూ! నీ కవిత్వపు రుచిని చూపించుటకా బ్రహ్మనాయుని చేత మా ఆస్థానమునకు పంపబడితివి?

భట్టు : కాదు ప్రభూ! కాలము తప్పివచ్చిన మీరు చవిచూడవలయు కరవాలపు వాడిని ముందుగ నివేదించుటకు.

నల : అది అనవసరమని తెలియ నంతటి మూర్ఖుడైనాడా బ్రహ్మ నాయుడు......?

భట్టు : అది అనవసర మనుకొనుటయు, మూర్ఖత్వ మనుకొనుటయు, సమానుషత్వ చిహ్నములు గదా ప్రభూ!

నాయ : (కుపితయై) ఈ అవమానమును భరింపజాలని నాయకురాలి కికనైన సెలవు నొసంగుదురా ప్రభూ!

భట్టు : (వికటముగ) మహామంత్రిణి కింతటి ఆత్మగౌరవమే యున్న నలగాము డేనాడో బాగుపడియుండువాడు కదా నాగమ్మా!

నల : (బెదరించుచూ) భట్టూ...! (నాగమ్మదిక్కై) నాగమ్మా! ఇతడు భట్టు వృత్తివాడని తెలియవా!

(నాయకురాలు చేయునది లేక మండిపడుచూ కూర్చుండును.)

నల : భట్టూ! నీ వచ్చిన కార్యము నిక నొక వాక్యమున ముగింతువా...!

భట్టు : (వినయముతో) అతిక్రమింతునా ప్రభూ!

నల : ఐన...కానిమ్ము...!

భట్టు : చిత్తము! తమావరించి యున్న పగను వృద్ధి బొందించు భ్రష్టులు సర్వనాశనమును చూచిన గాని శాంతింప రనునది పార తంత్ర్యము నభిలషింపని తమరు గ్రహించుకుని, భాగ్యమునూ, యశమునూ, రాజ్యమునూ, శౌర్యమునూ పెంపొందించుకుని, సకల కార్యములనూ సమకూర్చుకుని, అవ్యక్త కీటకములవలె గాక, మానవజన్మ నందిన ఫలము నాసించి, కౌరవాదులవలె నాశము

నందక అరివీరభయంకరు లౌటకు గాను మీ సోదరుని—నరసింహుని — వారికడకు క్షమాభిక్ష నర్థింప బంపి, పల్నాటి రాజ్యరమకు సద్యశోభూషల నొడగూర్తు రని ఆశించుచూ రక్తపాతము నకు మనసు పోని మా మలిదేవభూపతి తన మాటలుగ మీకు విన్నవింపు మని చెప్పి దానికి మీ రంగీకరింపని పక్షమున సమరము తప్పదనికూడ మనవి చేయు మని నన్ను పంపినాడు ప్రభూ !

(అందరూ నవ్వుదురు.)

నాయ : (నరసింహునితో) ఒక్క వాక్యమున నెన్ని ఉపదేశముల జొప్పించెనో చూచితివా నరసింహా !

నర : అదియేగదా వారి ప్రతిభ !

(నాగమ్మ నరసింహులు నవ్వుకొందురు.)

నల : వింటివా నాగమ్మా !

నాయ : చిత్రము ప్రభూ !

నల : నా కెదురుగ రణభూమిని నిలబడి కత్తిబట్టిన తమవద్దకు నా తమ్ముని క్షమాభిక్ష నర్థింప బంపవలెనట.

(నరసింహునితో) కంటివా వారిమగతనము నరసింహా?

(నరసింహుడు జలజలబోవుచు నవ్వును. నాగమ్మ వికటముగ నవ్వును.)

నల : భట్టూ! నీ వాక్యరచనావిధానమునకైన తగినట్లు లేదు గదోయీ వారిశక్తి. వారితో బోరుటయు నొక రణకేళి యనిపించుకొనునా! గుప్పిటకురాని వారి శిబిరములును, వ్రేళ్లపై లెక్కింపనగు వారి మూకయునా మమ్ము బెదరింపచూచునది? ఉహుఁ...! వారికై రాయబారి వౌటకు నీకైన సిగ్గేల లేక పోయెనోయీ!

(నాయకురాలూ, నరసింహుడూ బిగ్గరగా నవ్వుదురు.)

భట్టు : నేటి నవ్వులే రేపటి రోదనములు కాగలవు ప్రభూ! కాకి బలగ మెద్దియో కలదని మత్తగజకేసరుల నున్మత్తులవోలె గెలిచేయ దొరకొనుట భావ్యమా?

నాయ : భట్టూ! నీవును వారి బలగములోని వాడవేగదా? పొమ్ము! ఈ భూనాథుని వచనములనే అచట నివేదింపుము. సర్వమును

సమరభూమియే సరిచేయగల దని నామాటలుగ వారికి చెప్పుము.
(ఆగి) రాచకార్యము పూ ర్తియైనది కదా!

భట్టు : తమగాలి సోకిన ప్రదేశమున కాక మిగిలెడి దే ముందును మహామంత్రిణీ!

నాయ: (వికటముగ) ఉహూఁ...! బాగుగ గ్రహించితివోయీ!
(వెనుదిరిగి)...ఎవడురా...అక్కడ!

భటుడు : ఆజ్ఞ దొరసానీ...!

నాయ : ఈ రణభట్టునకు కానుక లీయనెంచితి నని కోశాధ్యక్షునకు నివేదింపుమురా!

భటుడు : చిత్తము. (వెడలును.)

భట్టు : నా కా కానుక యొక్కటియే కోరవడినదా మహామంత్రిణీ! అలరాజువలె దారియందు మిత్తి వాత బడనీక, యీ వృత్తాంతము నెల్ల మా భూపునకు నివేదింప నిచ్చిన నదియే గదా పదివేలు!

(అందరు అతనిని గంభీరముగ చూతురు.)

భట్టు : మహారాజా...సెలవు...!

(అందరూ వికటముగ నవ్వుదురు. భట్టు వెనుదిరిగి చూడకనే నిష్క్రమించును.)

( యవనిక పతనము )

## నా ల్గ వ ర ం గ ము

[ఇరువురు గ్రామస్థులు కోళ్లను చంక నిరికించికొని పోవుచుందురు.]

1 గ్రామ : నా బమ్మన్న మీద యిప్పు డిల్లంతా పందెం కడతా నోయ్ పుల్లాయ్! కత్తిగట్టు నీ నాగమ్మకి నూద్దారి...!

2 గ్రామ : ఓహో హో హో... ! నూశాం గదోయ్ ...బావా ! నూశాంగా నాగమ్మ కత్తి గట్టింది లేదు...గెంతింది లేదు.... నీ బమ్మన్న యెలా చిత్తయ్యాడో. ఊరంతా సెబుతోం దినలా!

1 గ్రామ : ఎనకదెబ్బ కెవడేం నేత్తాడా్రి? మగసిరి దెబ్బకాసుకో అలంటే ముందు నుంచోఆలి. తెలిసిందా! అదీలెక్క!

2 గ్రామ : ఉరేయ్, నువ్వు సత్తికాలపు టూసులు సెబుతుండావురా! ఇప్పుడు నూపంతా పందెం మీదే కదరా! పందెం. పురుసులూ అంతే...పుంజులూ అంతే!

1 గ్రామ : ఉరేయ్! అందుకనేగదరా అన్నాయంగాడి తోటీ ఆడు కూతురుతోటీ పందే లచ్చుకోరాదంట. అప్పుడెప్పుడో యసనకడు గేసిం దన్నావుగా.....యియ్యాల నూడరాదూ దీని తడాకా...!

2 గ్రామ : నూశాం...నూత్తాం! కానీరా...! నాకడ సెప్తావంటావ్రి. నీ పౌరుసం! నా కోడి కెనకతన్ను దొడ్డది. నీ కోడి నత్తెకాలంది. ఐనా......పందెం కట్టరే...!నూద్దారి.

1 గ్రామ : ఓరేయ్! నాయం లేదంటావ్రి? కోడిపుంజు మూలాన్ని కొంం పముస్తె కోమంటూడావ్రి ద్రైబం!

2 గ్రామ : భావా! నా మాటినుం ఉంకో పుంజుమీదేయ్ గాని, నా దాని మీదొద్దరే! ఇదీ...గురిజాలోరి గుమ్మంకాడ పుట్టిందరే! గురిజాలోరి దెబ్బంటే తెలుసా? గుండె సీలిపోఆల! అంతే!...!

1 గ్రామ : ఓరే పుల్లాయ్! నా పుంజుమాత్రిం తక్కువనుకున్నా వేంట్రా! బిమ్మన్నగారి వరండాలో పుట్టిందరేయ్...మొలమగాలి... ఇన్నావా...మొలమగాలి చోకిన యేడామల్లూ మొలుగేరోయ్! బావా! మొలుగే!

(మీసం దువ్వును. అంతలో ఓ బిచ్చగాడు ఆ దారినే పాడుకుంటూ ప్రవేశించును. వారా పాట వినుట నభినయింతురు.)

బిచ్చగాడు :

—• పా ట •—

మట్టిలోనే పుట్టి మట్టిలోనే కలియు
అట్టి బొమ్మకు ఆస పెట్టావా!
మిట్టిపడు మనికూడ చెప్పావా! —మట్టి...

బంగారమునకునై శృంగారవతికినై
దొంగలై మను డంచు పలికేవా!
కంగారువడ చూసి కులికేవా! —మట్టి...

విద్దె గరచినవారు, సుద్దు లెరిగిన వారు
ముద్దుకై బతిమాల విన్నావా !
మొద్దులే గద్దెక్క గన్నావా ! —మట్టి...
అన్నతమ్ము లటంచు పిన్నపెద్ద లటంచు
కన్నుగానని వారి మెచ్చేవా !
మన్నించువారి బాధించేవా ! —మట్టి...

(ఆ బిచ్చగాని వెనుకగా అగ్రామస్థులు ఒకరినొకరు వెర్రిగా చూచుకొనుచూ పోవుదురు.)

( యవనిక పతనము )

ఐ ద వ ర ం గ ము

[నలగామని విలాసభవనమున నలగాముడూ నాయకురాలూ ప్రసంగించు కొనుచుందురు.]

నల : నాగమ్మా! నీ అభిప్రాయము ప్రశంసార్హమే గాని కార్యరంగమున నెట్లుగా పరిణమించునో యనునదియే నా సందేహము.

నాయ : అంతగ భీతిల్లడి. మీరు సంధి కియ్యకొనిన సరసముగా నుండెడిది గదా ప్రభూ!

నల : ......నాగమ్మా...!

నాయ : ప్రభూ...!

నల : (సగర్వముగ) నలగామన్నృపవతంను నెంతగ చుల్కన చేసితివి!

నాయ : మీ పై నాకుగల మహదాశయమే అట్లు పలికించినది ప్రభూ...!దోస మున్న క్షంతవ్యురాలను.

నల : ఐన...వారికి బలగ మేమియు లేదనియే గదా నీవు ఊహించినది!

నాయ : ఉహుఁ...! లేకేమి ప్రభూ! అరువదేవురు నాయకులు లేరా? కత్తిబట్టుట యన నేమో యీ నాడే నేర్చికొన నారంభించిన అడవిమూక సైన్యము లేదా? తినుటకే లేని వారికై ఆ సిబ్బంది యంతయు ప్రాణముల నీయ వెనుదీయదని వారే చెప్పుచుండిరి గదా ! ఇంక వారికి కొఱత యేమున్నది ప్రభూ?

నల : స్వవిషయము......?

నాయ : (నవ్వి) మనకును వారికిని హాస్తిమశకాంతరభేద మున్నది గదా ప్రభూ!

నల : (ఆలోచించి) మలిదేవ నలగాముల పోరునకు ఫలము యే సామంతునకో పట్టముగట్టుట కాదుకదా నాగమ్మా!

నాయ : (సగర్వముగ) సామంతుల కంతటి సామర్థ్యమును, సార్వభౌముల కంతటి శక్తిహీనతయునా ప్రభూ?

నల : ......కాలము తప్పివచ్చిన...?

నాయ : చిరుమబ్బుతెర లెంత కాలమని తీక్ష్ణమయూఖుని గప్పియుండ గలవు ప్రభూ?

నల : (వికాసవదనమున) నీ వాదనక్రమవిధాన మనన్యసామాన్యము నాగమ్మా! ఐనను...అన్నదమ్ముల పోరున సామంతు లందరును కల్పించుకొందు రందువా!

నాయ : కల్పించుకొనజాలరేని తటస్థముగ నుందురు...

నల : తమ్ములపై కత్తిగట్టె ననుకొందురేమో?

నాయ : అ శ్లైన్నటికిని కానేరదు. జ్ఞాతి ప్రబలి యుండగా అగ్నితో పనిలేదని అవనీధవు డెరింగె నని హార్షింతురుకూడ.

నల : అటులకానిచో...?

నాయ : అన్య మేమున్నది...? సామంతులై యుండియు అట్లు విద్రోహ మొనర్చిన పాపఫలము ననుభవింతురు.

నల : ఐన నిక కర్తవ్యము...?

నాయ : (చిరునవ్వుతో) తొలుతనే విన్నవించి కొంటినిగదా...బ్రహ్మనాయుని బండారమును బయల్పెట్టుట యని!

నల : అట్లయిన మన సామంత మండలాధీశు లెల్లరకును ఆజ్ఞాపత్రిక లంపుట అవసర మేమో!

నాయ : మీ హృదయ మెంతగ భీతిలియున్నది ప్రభూ! ఆ ఆటవికుల మూక నణచుటకు సైన్యము కూడ కావలెనా...!

నల : (గంభీరముగ) నీ శక్తి నే నెరుగనిది కాదు నాగమ్మా...! కాని, చిన్నత్రాచును కొట్టుటకైనను పెద్దకోలయే అవసరము కదా యని.

నాయ : అది లక్ష్యమును తప్పక కొట్టుట యందున్నది ప్రభూ !

నల : సర్వవేళల దైవము మనకే అనుకూలించు ననుకొనుట ఉచితము కాదేమో !

(నాగమ్మ తలవాల్చికొనును.)

నల : ...నాగమ్మా...!

నాయ : ...ప్రభూ !

నల : ఐనను...నీ అభిప్రాయము... ?

నల : తమ అభిమతమును నే ధిక్కరింప జాలుదునా ప్రభూ !

(నలగాముడు సంతోషమును చూపును. మెల్లగ దారితీయును. నాగమ్మ వాని ననుసరించును.)

యవనిక పతనము.

## ఆ ర వ ర ం గ ము

[ వనమధ్యమున అనపోతు ]

అనపోతు :—

తల్లియు, తండ్రియుఁ, గురుడు, దైవము నెల్లరు నీవ యంచు నా యుల్లము దెల్పుచున్నది గదోయి! గ్రహించియు నేడి టీ విధిఁ గల్లలు పల్కి నా హృదయకావ్యము బూడిద పాలొనర్చి, న న్నల్లరివెట్టినావు కద హా! యెటు లోర్చెద నీ మహావ్యథఁ.

అన్నా...! మోసముజేసి నా యాసలనెల్ల కోసివేసినావుగదా! కారణ మిద్ది యని వచించిన నేను నీదారి నడ్డుదు ననుకొంటివా! శ్యామాంగియు, వదినగారును నా అమాయికత్వమున కెంతగ నవ్వికొనిరోగదా! ప్రీతివిషయమునను అప్రమత్తుడవై యుండు నీవేడ, చంద్రహారమును, ముద్దుటుంగరమును మరచి వచ్చుట యేడ నన్నా! నీ ఆ మాటలు నమ్మి, నీ కానందము గూర్చ వెనుకకు పోయి వత్తు నని ముందునకు వచ్చినందులకా నాకీ శిక్ష! అనవా లిది యని గూడ చెప్పు మని పలికితివే! ఇది యంతయు ధర్మభీతిచే పలికిన దేనా అన్నా!. నాహృదయమున నింతటి అవమాన దవానల మును రగుల్ప నేనేమి దోస మొనర్చితినోయీ!.....(ఓ పత్రము

వంకచూచుచూ) ఎంతటి ఆసబెట్టితివన్నా! నీపాదపద్మముల గొల్చు భాగ్యము నాకీ జీవితమున లేక యుండ సల్పితివి కదా! ఒక అడుగు ముందునకు గమించినను, చెన్నకేశవునకును, అన్నదమ్ము లంద రకును ద్రోహ మొనర్చిన ట్లవునని కదా వ్రాసితివి. నా జీవిత విపంచీతంత్రులను త్రెంచివేసితివికదా... అవి యిక యెట్టి రాగము నాలపింప గలవన్నా...!

( తెర లో )

మాడచి : (ప్రవేశిస్తూ)

గీ. ఎవని హృదయము నవనీత, మెవని పలుకు
ప్రణయమును జిల్కు, నెవని భావప్రసూన
సౌరభమ్మున శాంతి విశ్రాంతి నందు
నతడె బాలుడు; కలడు నే డాత డెచట?

అన : (వినుట నభినయించి)...మాడచి గొంతువలె నున్న దే! నాయీ విచారవదనమును తిరిగి మాడచికి చూపవలయునా! కాదు. అ ట్లెన్నటికిని కానేరదు.

అన్నా......!

గీ. ఇహమునందున నీకు ద్రోయిలి ఘటింప
నీని నీయాన శిరసావహింతుగాని
పరము నందున నను జేర బానగొనుము
ప్రథితగుణసాంద్ర! భోగేంద్ర! బాలచంద్ర!

(మాడచి ప్రవేశించును. ఆమె అనపోతును చేరకమునుపే అత 'డన్నా' అని పడిపోవును. మాడచి అది చూచి చకితయై.)

మాడచి : గురూ! గురూ! ఇదేటి దారుణకృత్యము?

అనపోతు: (బాధ నభినయించుచూ) మాడచీ...! ఇది స్వయంకృతము. నీ కన్నీటితో నన్ను కలుషితము చేయకూడదు సుమా! రక్త సిక్తములైన యీ జందెమును, బిరుదులును నా యానవాలుగ గ్రహింపుము మాడచీ! ఎన్నడైన నా అన్నను కలిసికొందువేని

వీనిని వాని పాదములపై నిడి పవిత్రీభూత మొనర్తువుకదా! .. మాడచీ...!మాడచీ...! అన్నా...అన్నా...! అబ్బా...!

(చేతులు జోడించి, బాధ నభినయించి కూలి పోవును. అంతదనుక చూచుచు నిలుచున్న మాడచి, కన్నీటి నద్దికొని, ఆ జంజెమునూ, బిరుదులనూ తీసికొని,)

మాడచి : దైవమా ! ఒక్క క్షణములో నెంతటి వైపరీత్యమును ఘటించితివోయీ ! ఈ దుర్వార్తను బాలున కేమని విన్నవింతును,...తండ్రీ! ఇది వినినంత నాతడు విలపింపగాంచి నే నెట్లు నిలువగలను నాయనా !

(వానిని కన్నుల కద్దికొని)

ఇదియు నాకర్తవ్యమే నందువా ప్రభూ! (నడచుచు) కానిమ్ము...! నీ దాసురాలిచే నీ యిచ్చవచ్చిన కార్యముల జరిపింపుము తండ్రీ... నిన్ను కాదనగలవా రెవరోయీ !

(కన్నీటిని తుడిచికొనుచూ నిష్క్రమించును.)

యవనిక పతనము.

## ఏడవరంగము

[నాగమ శయనాగారమున నున్మత్తురాలి వలె తిరుగాడుచుండును.ఎచ్చట జూచినను ఆమెకు బాలచంద్రుడే కనబడుచుండును. ఆమెకు చికాకు అధిక మగును. చెలికత్తె లామె మనోభావముల నర్థము చేసికొన జాలక అటు నిటు దిరుగాడుచుందురు. ఆమెలోని భయ మధికమైన కొలదియు నామె వణికి పోవుచు, తూలుచు,అప్పుడప్పుడు కేక లిడుచు గదినంతను ఛిందర వందర జేయుచుండును.]

ఒకచెలి : నరసింహరాజులుంగారికి తెలిపివత్తునే అక్కా...!

(2 వ చెలికత్తె 'సరే'నని కంటితో తెల్పును. నాయకురాలు పిచ్చి కేక పెట్టి పడిపోనుండగా చెలికత్తె పట్టుకుని ఒకచో కూర్చొనజేయును. చెలి ఆమెకు వలయు పరిచర్య చేయుచుండును.)

చెలికత్తె : అమ్మా...! అమ్మా...! ఏమి యీ కలవరము...?

నాయ : (కొద్దిగ తెప్పరిలి) ...ఏమే...! ఇచటి కెవరును రాలేదు గదే!

చెలి : ఔనమ్మా......! ఎవ్వరునూ వచ్చియుండలేదు.

నాయ : (నిట్టూర్చి) ఉహూఁ... ! ఎంతటి మంత్రిగాడే ఆ బాల చంద్రుడు! నా కన్నులయెదుట నాచేతనే యెంతటి నాటకము నాడించి నాడే ?

(నరసింహు డాత్రమున ప్రవేశించును.)

నాయ : (పకపక నవ్వుచు)... నరసింహా! ఏమి నీ యీ కల్లోలము...!

నర : (నిట్టూర్చి) ఉహూఁ...! పందకు సర్వప్రపంచమును పంద తనమున మునిగినటులనే ద్యోతమానట.

నాయ : ...అభిప్రాయము...?

నర : (అటునిటు జూచి) ఏమున్నది...? యీ నీ విలాసగృహపు వాతా వరణమే తెల్పుచున్నది కదా!

(నాగమ్మ, నరసింహులు కలిసి నవ్వుకుందురు. దాసీజనము వెనుకకు మరలును.)

నాయ : (ఆసనముచెంతకు దారితీసి) నిజముగ నరసింహా! ఆ బాల చంద్ర పిశాచమెంత భీకర తాండవ మొనర్చినదోయీ! బ్రహ్మ నాయుని ఆజ్ఞానువర్తు లగు ఆ భూతజాతి యంతయు నీతనిగూడ సేవించును గావలయునే! ఎచటగనినను అతడై, ఎద్ది వినినను అతని పలుకై, ఏమి పలికినను అతని స్మరణమై సర్వాంతర్యామి వలె స్ఫురించినాడోయీ!

(నరసింహుడు విరగబడి నవ్వును)

నాయ : (కుపితయై) నీకు తెలియదు నరసింహా! అయ్యది యెల్ల ననుభవైక వేద్యము. ఏ మందువు...!

నర : మహామంత్రిణి అభిప్రాయమును కాదనగల్గుట కూడనా...!

నాయ : అది కాదోయీ! బాలచంద్రుని నిజస్వరూపము నీకు గ్రహింపరానిది. ఆతని ప్రతిభావిశేషము లనూహ్యములు. అది యెరిగియు నే నేల వీనిపై కత్తిగట్టితినో యెరుగుదువా. ఆ బ్రహ్మ నాయుడు నన్నవమాన దవానలమున ద్రోసి, నాకు ప్రతికక్షియై నిలచి, నాకు గల గౌరవాదుల హరింపనెంచుటచేతనే. ఈత డా తని కుమారుడై అతనికి చేదోడౌటచేతనే! ఆసేతుహిమాచల పర్యం తమును భారతమున స్వేచ్ఛావాయువు లాడుచుంట తన మూలము ననే ననియు, భరతవీరుల శౌర్యమంతయు వెలమకులమునందే

మూర్తీభవించె ననియు. నాతడు తండ్రితో బాటు నాల్కను నగరా చేసికొని మోగించుట విని, అబల ననిపించుకొను నా కంటె నాత డెట్టి ఘనుడో రూపింప నెంచిరే నే నిట్లు తలపడితిని; కాని నాయందన్యభావము గలదని యూహించితివా నరసింహా! రాజ్యము రమణీమణిచేతుల నెట్లుగా రాణింపగలదో తెల్లము చేయుటకే గదా నే నుద్యమించితిని! బ్రహ్మనాయునిలో గల శాంత్యౌదార్య ములు నన్ను మాత్రము మోహితను చేయలే దనుకొంటివా! బ్రహ్మనాయుని బలగమును బ్రద్దలుచేయు నూహనే గదా అతని నిట్లుగా నుసికొల్పితిని! అతని యందలి సహనము చెదర చేయు టకే గదా అలరాజు నవ్విధి హత మొనర్చితిని! అతని నన్ని తెరగుల నవమానపరచుటకే గదా ఆ రాయబారముల నట్లు విఫల మొనర్చితిని......; ఏమందువు ..నరసింహా...! ఇయ్యదంతయు నా ప్రతీకారపూర్వక మగు ఉత్సాహమే కాని అన్య మందువా! ఇందు స్వార్థమునకు తావు లేదు గదోయీ! ఈ గురిజాల రాజ్య వధూటి నన్నిభంగుల నలంకరింపనేగదా నా యీ రుధిరతర్ప ణము......?

నర : ......నాగమ్మా...!

నాయ : ఏమి నరసింహా! నా అభిప్రాయములు నేటికైనను నీకు బోధ పడినవా!

నర : ...ఆఁ...! ఐన...నీ ప్రతీకారవాంఛానలమున నేనును యీ గురిజాల ప్రజలెల్లరును నింధనముల బోలువార మనుమాట!

నాయ : (నవ్వి) ఎట్లు కాగలరు! మీ గౌరవప్రతిష్ఠల పురస్కరించి కొనియే గదా నా ప్రతీకార దీక్ష జనించినది......!

నర : ఐన...యీపోరున కంతము...?

నాయ : (వికటముగ)...ఉహుఁ...! ఎవరి విధిని వారు సంపూర్తిగ నెరవేర్చికొనిన పిదప...!

(ఆలోచించుచూ నరసింహుడు దాటిపోవును. నాగమ అనుసరించును).

( యవనిక )

## ఎ నిమి ద వ రం గ ము

[నలగామడు శయనాగారమున నిదురపట్టక యేదియో ఆలోచించుకొను చుండును. అతనిలో విచారము వెల్లివిరియు చుండును.]

నలగాముడు : నేటి నవ్వులే రేపటి రోదనములు కాగలవని కదా భట్టు పలికినాడు! నిజమే! ఈ పలనాటిసీమ నేకచ్ఛత్రాధిపతిగ నేలగల నను తలంపుననే కదా నేనింతటి దౌష్ట్యమున కొడంబడితిని. నాయకురాలు నా శిరమున నీ రత్నమయ కిరీటమును చిరస్థాయిగ నుంచగలదను భావముననే కదా 'నా' అను వారిని సైతము నాశ మొనర్ప నుంకించితిని. సార్వభౌముడనై నాల్గుదిక్కులను నేలదలం చియే కదా కన్ను మిన్ను గానని యీ యకార్యాచరణమున కొడం బడితిని. ఛీ! ఆ స్వార్థచింత నాయం దెంతటి గర్వమును పోసినది! శాంతిమార్గమున సంధి పొసగునేమో చూత మని నా పితృ సమాను డగు బ్రహ్మనాయు డంపిన రాయబారుల నెట్టి యిడుములకు నవమానములకు లోనుగా చేసితిని! ఆనాయకురాలి పల్కుల కను గుణ్యముగ తల నూపవలసినదే కాని, 'ఔను', 'కాద'ని మనోభి ప్రాయము వెలిబుచ్చుటకేని అస్వతంత్రుడను కదా! ఇంతదనుక నామెయే కార్యభారము నెల్లను నిర్వహించు చుండుట చేత యీ గురిజాల ప్రజలకు నాయకురాలే నాయకురాలై పోయినదే! ఈ నలగాముడు తనకు తానే యథే చ్ఛమై పలుకాడలేని యీ స్థితిలో, ప్రజల నెట్లుగా శాసింపగలడు! నా యీ అశక్తతయేగదా నా అల్లు నకారణముగ చంపినది! నా యీ హృదయ దౌర్బల్యమేకదా నా కన్నకూతు నగ్ని పాల్జేసి నది! (ఆగి, ఎక్కువగ విచారపడుచు) నలగామా! నీవింక నీ రాజ్య మున నిలువ నర్హుడవుగావు. ఈ కిరీటమును తలనిడికొనుటకుగాని, యీ బంగరు గద్దెపై నాసీనుడ వౌటకుగాని నీ కీ జన్మమున నధి కారములేదు. నీ సలిపిన అమానుషకృత్యముల కిక నీ యెడద సలసల క్రాగిపోవలసినదేకాని క్షమాభిక్షనర్థించుటకైన తగనిదైనది. గురుచరణంబుల నంటి శరణని వేడుటకైనను నీప్రాణము - పనికి రాదునుమా!

(లేచి, నిలబడి, ఆలోచించి) ఏమి...! బ్రహ్మనాయునియందు మాత్రము స్వార్థము లేదా! నన్ను పదవీభ్రష్టుని చేసి, నా రాజ్యము నా మలిదేవునకు కట్టి పెట్టవలయునను తలంపులేదా! లేకున్న నేడనో బ్రతుకు తా నేల నీ రాయబారములకు గడంగవలెను! మలిదేవుని మహీనాథునిగా నొనర్చి తాను మహామంత్రియై త్న్మాతలమునెల్ల శాసింప నాశింపని యీతఁ డిప్పుడు నమరోన్ముఖుఁ డౌట యేమి? బాలవీరులు రణాంగణము జేర నువ్విళ్లు లూరుచున్నా రని పెద్దవోలె పలికెనేకాని అతని యందు మాత్ర మా అభిప్రాయము శూన్యమా! సర్వమును శాంతముగ చక్కబరచుకొొన దలంచునతనికీ జంజాటమేల?అతడే ప్రతిభాన్వితుడైన యెడ నా బాలచంద్రు డేల నాతని మాటల ద్రోసిరాజనవలయును! యాచించియైన నర్ధరాజ్యము నార్జింపదలంచుట యందుగల అతని అభిప్రాయ మేమై యుండును?

(తిరిగి పచార్లు చేసి, నిలబడి, గంభీరముగ)

ఊహుఁ...! బ్రహ్మనా...! నీ నెరసిన తలవెండ్రుకలు నీలోని కల్మషము నెంతగ దాచిపెట్టుచున్నవోయీ! నాయీ మృదుస్వభావము నెఱింగి యెంతగ మోసపుచ్చ నెంచితివోయీ!

(పోబోవుచు)...రాజ్యకాంక్ష నందిన యే మహాత్ముడు శాంతి నందగలిగెను? ప్రకృతి విరుద్ధముగ నేమి యొనర్పగల డీ మానవుడు! అంతయు భ్రమ...అంతయును భ్రమ.

(వెళ్లిపోవును.)

( యవనిక )

## తొ మ్మి ద వ రం గ ము

[బ్రహ్మనాయుడు, కొమ్మరాజూ, భట్టూ, మలిదేవుడూ, కోటకేతుడూ, వీరారెడ్డీ... కొందరు సేవకులు...గల మలిదేవ రాయల కొలువు.]

మలి : (కోటకేతునితో) మా అన్నగారును, వారి అనుచర బృందమును కుశలు లేగదా!

కోట : బ్రహ్మనాయుని దయవలన...

కొమ్మ : బ్రహ్మనాయుని ప్రభావ మీ నాడా నలగామున కర్థమైనది!

రెడ్డి: ఆపత్కాలముననే కదా మానవులకు దైవశక్తి గ్రహింపనౌట!

(మలిదేవుని మోమున చిరునవ్వు, బ్రహ్మన్నలో హాసము)

భట్టు: నలగామునాస్థానమునుండిగూడ భట్టుమూర్తులే రాయబారులుగ పంపబడినారే!

కొమ్మ: అచ్చటి భట్టుమూర్తులను కూడ భటశ్రేష్ఠు లనియే పిలుచుకొందురు... తెలియునా భట్టూ!

(మలిదేవ భట్టుమూర్తులు నవ్వుకొందురు. రాయబారులు చిన్న వోదురు.)

బ్రహ్మ: ...కోటకేతుడు తెచ్చిన విశేషములు?

కోట: న్యాయస్థాపన కనువగు అభిప్రాయములు.

బ్రహ్మ: మిమ్ము బంపినది...?

కోట: నలగామ-నృపశేఖరులు...!

బ్రహ్మ: ...ఐన కలుగు ప్రయోజనము...?

భట్టు: ఏ మున్నది.. కాలాపహారణము!

(మలిదేవ బ్రహ్మన్న కొమ్మరాజులు నవ్వికొందురు.)

రెడ్డి: ...అంతటి నైచ్యము...

కొమ్మ: అల్లుని చంపికొనిన అపకీర్తిపున కాపాదింపరాని దనియా...!

(రెడ్డి తలవాల్చికొనును.)

కోట: అలరాజును నలగాముడు చంపె ననియా తమ యభిప్రాయము...!

భట్టు: అతడుకాదేని అతని అనుచరుడు...

కొమ్మ: పొరబడితివి భట్టూ! పాప మా నలగామున కనుచర వర్గమెక్కడిది...? అతడే నాయకురాలి అనుచరుడు కదా!

కోట: అభిప్రాయము...?

బ్రహ్మ: ఏ మున్నది...? నరసింహు డేరి యనుచరుడో తేలక వారు సంశయ పడుచున్నారు.

కోట: (లేని నవ్వును తెచ్చికొని) సరి. ఆ నరసింహునిపై పగను సాధించుటకా యింతటి సన్నాహమును?

భట్టు: ఔను. పుట్టలో నున్న పామును కొట్టుట యెట్టి కష్టకార్యమో తమకు మాత్రము తెలియదా!

రెడ్డి : ఆ పాము తనకు దానై బయటబడిన...?

భట్టు : ఊహుం...! ఏనాటికైనను దానిని శిక్షింపక తప్పదుకదా!

బ్రహ్మ : భట్టూ...! బయటపడి శరణు వేడినచో గరళము పిండి విడుచుటయే సమంజసము కదా!

భట్టు : నాడు భట్టు నవమానించుటకు మూరటుల జరిగియుండిన వీరలు తమ అభిప్రాయము నామోదించి యుందురు.

కోట : (కుపితుడై) మలిదేవ మహీనాథుని మనోభిప్రాయములనే భట్టు వ్యక్తీకరించుచున్నాడా!

బ్రహ్మ : ఇది మలిదేవు నాస్థానమని మరచినారా రాయబారులు...!

కొమ్మ : ఇది మరపుకాదు బావా! వారి ఆస్థానపు టాచారములే యిచట కూడ నుండి యుండు నని తలచిరి కావలె!

మలి : మఱదుల చలోక్తులకు మలిదేవుడు మహదానందము నందినాడు.

(సభికు లెల్లరు మందహాసము చేయుదురు.)

రాయబారు లీ సమయమున నాయకురాలిని తోసి రాజనుటకు కారణము...?

కోట : నలగామునిచే నియుక్తులై, నరసింహుని ఆమోదమునందియే నాయకురాలి హృదయము నిచట రాయబారులు విప్పి చెప్పుచున్నారు ప్రభూ!

బ్రహ్మ : ఐన...మా తుది ప్రయత్నము ఫలించిన దనియే తలంపవచ్చునా...!

కోట : చిత్తము! మాచర్లమండలమును తిరిగి శాంతముగ నేలికొనుమని కూడ మనవి చేయు మనిరి ప్రభూ!

భట్టు : సార్వభౌముని పాదపద్మముల నాశ్రయించుటయు, నాయకురాలిచే నాలుక నీవలకు పెకలింపించికొనుటయు తప్పిన వనియేనా తమ సెలవు...!

(అందరును నవ్వికొందురు.)

బ్రహ్మన్న : బావా...వింటివిగదా...!

కొమ్మ : వినుటయే కాదు...విస్మయపడుచుంటిని కూడ.

బ్రహ్మన్న : ఇక శరణని వచ్చిన నరసింహుని......
కొమ్మ : క్షమించుటయే గదా మన ధర్మము!
భట్టు : వారు మనలో రగిల్చిన పరాభవానలమును దిగమ్రింగు మనియే కదా మహామంత్రులు వచించునది.
బ్రహ్మన్న : కాదు, వారి పశ్చాత్తాపమే దానిని శమింపజేయ గలదని.
మలి : (సాశ్చర్యముగ) బ్రహ్మన్నా...!
బ్రహ్మన్న : (సంతోషమున)...ఏమి ప్రభూ!

(సేవకుడు ప్రవేశించును.)

సేవ : జయము...జయము...మహీపాలా! జయము!
మలి : ఆ ఆతురయేమిరా!
సేవ : తమ దర్శనార్థమై బాలచంద్రులు...

(బ్రహ్మన్న కలకల పోవును)

మలి : వేగమె లోనికి దోడ్కొనిరమ్ము...!

(సేవకుడు నిష్క్రమించును.)

మలి : బ్రహ్మన్నా! బాలచంద్రుని రాకకు గల కారణ మనూహ్యము కదా!

(బ్రహ్మన్న మౌనముగ నుండును. బాలుడు రౌద్రమూర్తియై సభా ప్రవేశము సలుపును. అతని చేతి కరవాలము తళతళ మెఱయుచూ చూపరహృదయముల కళవళ పరచుచుండును. అతడందరకును నమస్కరించును.)

బ్రహ్మ : నాయనా...! ఈ శుభావసరమున నింతటి యావేశమునకు కారణము?
బాలు : ధీరుల మనుకొను వారి భీరుత్వము తండ్రీ!
బ్రహ్మన్న : భావము...?
బాలు : కదనభూమి నంతను గలయజూచి, నేలయీనిన పగిదినున్న క్షుద్రశాత్రవానీకము నెల్ల వీక్షించి, నా ధర్మమును నిర్వర్తించి కొనవచ్చిన నాకు రాజదర్శనమునే దుర్లభము చేయనెంచిన యీ నాయకులు భీరులు కాక ధీరు లెట్లాదురు నాయనా!
కొమ్మ : శాంతింపుము తండ్రీ!...శాంతింపుము!!
బాలు : ఈ పందల సాంత్వనవచనములు నీలోని అవమానజ్వాలను కూడ హరించినవా మామా!

కొమ్మ : సంధిప్రయత్నము లన్నియు సఫలము కానున్న యీ సమయమున వారు నీరాకకు వెఱచియుందురు బాబూ! నరసింహుడే శరణార్థియై రానుండ మనకీ అట్టహాసమేల ?

బాలు : బాగున్నది! కొమరుని జంపిన పాపకర్ములు శరణని పల్కినంతనే క్షమించివుచ్చుటకు నీ మనసె ట్లంగీకరించెను మామా! స్వచ్ఛందక్షాత్రరుధిరము నీ నుండి నీ కొమరునితో బాటు బహిర్గమించినదా! ఇంతటి శక్తివిహీనుడ వేల మలిదేవమహీనాథునిచే శపథము జేయించితివి? శపథ మటుండె బో యీ మాస త్రియపు గడువు నేల కల్పించితివి? సర్వసన్నాహములను సలిపికొని సమరభూమిని నిలచినార మని క్ష్మామండలి నెల్ల నేల చాటింపించితివి ? మామా...! మాచర్ల మండలమునకునూ, రేచెర్ల వంశమునకునూ నగుబాటు గూర్పనా యీ మీ ప్రతినలు...? అదియునుగాక...

కోడి పందెములందు నోడిపోయినవారి
నాడ సల్పిరి కాననాంతరముల
ఆలు బిడ్డలవీడి అడవి నుండినవారి
నరుక నెంచిరి కారణమ్ములేక
సంధిమాటలు పల్కు జామాత గొంతులో
గరళమ్ముబోసి సంబరముపడిరి
తమ సుఖమ్మునకు రక్తము ధారవోసిన
ఘనుని పై కత్తినిగట్టినారు
కరుణ యననేమొ, మోక్షమార్గమ్మదేమొ,
సద్వ్యశిశ్నీల దేలు రాజస మదేమొ
కానగా రాని ఆ నలగాము నెంచి
దయదలంచుట యేటి పెద్దరికమన్న.

బ్రహ్మ : ...నాయనా...!

బాలు : ...ఏమి ఆజ్ఞ తండ్రీ!

బ్రహ్మ : ప్రాజ్ఞులందరును యేకగళమున నుచ్చరించు దానిని కాదని ధిక్కరించుటయా నీవు నా కొమరుడవై నేర్చికొనినది...?

బాలు : కాదు తండ్రీ...!
సంధి కియ్యకొనక సమరమ్ము వాంఛింప
బాడిగాదటనుచు భట్టుపలుక,
రాయబారివాట బ్రతికి తీవనుచు నా
గమ్మ పలికెనంట గనరొ తండ్రి!

బ్రహ్మ : (నిలబడి, ఉగ్రుడై) నీవు మాచాడ కుండుట మలిదేవుని అభీష్టమని గ్రహింతువా!

(బాలుడు శిరమును వాల్చికొనును. అంతలో చకచక మాడచి ప్రవేశించును. ఆమె నెవరుగాని అడ్డుకొనరు)

మాడచి : ప్రభులందరకును మాడచి ప్రణమిల్లుచున్నది.

మలి : మాడచీ...! నీ యీ అపూర్వాగమమునకు హేతువెద్ది...?

మాడచి : దర్శనాభిలాష ప్రభూ!

బాలు : చెన్న కేశవుడు మాచర్ల మండలమునెల్ల చల్లగ చూచుచుండెను గదా మాడచీ...!

మాడచి : ద్రోహచింత నెరుగని వారికీ సందియమేల జనింపవలె బాబూ!

బాలు : (ఖిన్నుడై)...మాడచీ...!

(వీరు లొకరినొకరు చూచుకొందురు.)

మాడ : బాబూ...!

బాలు : (మెల్లగ) అనపోతును గురించిన విశేషములు తెచ్చితి వను కొందును.

మాడ : విశేషములకు జతపరచి కానుకలనుగూడ తెచ్చితిని బాబూ!

మలి : అన్న పంపిన కానుకను తప్పుడే స్వీకరింపవలెను గావలె!

మాడ : దివ్యప్రసూన మెచ్చట నున్నను పరిసరప్రాంతమంతయు నా సౌరభము నాఘ్రాణింప నౌగదా ప్రభూ!

బాలు : (గంభీరముగ) విధి నిర్వహణమునందు జాగుచేయుట అనుచితము కదా మాడచీ...!

(మాడచి తలవాల్చి గంభీరముగ నుండును.)

మలి : బాలుని వదనమండలమున నా భావకల్లోలమును వీక్షించితివా బ్రహ్మన్నా!

(బ్రహ్మన్న గంభీరముగ ఆలోచించుచుండును.)

కొమ్మ : మాడచీ! అల్లు నింతగ ఆరాటపరతువేల...?

మాడచి : సభ్యాసభ్య విచారణ యందున్నాను దొరా!

కొమ్మ : సంధి ప్రయత్నములు సఫలమైనవి, విందులగుడువ నీ రాయ బారులతో సహా వెడలనున్నారము, అట్టి యీ తరుణమున......

(మాడచి బాలుని వంక చూచును. బాలుడు శిరమును వాల్చికొనియే యుండును.)

మాడచి : (వికటముగ) ఈకానుక అవశ్యము యీయదగినదే ప్రభూ!

(రక్తమున తడిసిన జంద్యమును, బిరుదును అతనికీయ నుండును. బాలు డవి చూచి చకితుడై అందికొనును)

బాలు : మాడచీ...! మాడచీ...! ఇదేటి ఘోరము...? నా ప్రాణమునకు ప్రాణమగు అనపోతున కా యీ దుర్గతి! నాచేసిన దోసమునకు శిక్షయా అతని కీ అకాలమరణము? ఎంతగ విల పించినాడో...! ఏమని శపించినాడో...! నా అన్యక్తపు వాత్ర నెంతగ తూలనాడినాడో...! శ్రీహరీ...! నా పొనరింప నున్న కార్యములకు తొలుదొలుత నా సోదరునే బలియొసంగ నలిపితివా! నన్నొక క్షణమైనను వీడియుండనోపని నా సోదరుని...ఆ ఉదార స్వభావుని నా ఒక్క దోసమునకై నానుండి యెల్ల కాలమునకును వేర్పరచి కులుక నెంచితివా? ఆ అలరాజ దివ్యమూర్తిని నానుండి హరించిన ఆ నరసింహునిపై కసితీర్చుకొన నెంచితినేగాని, యీ నా సోదరుని చంపికొనినందులకుగా నాకు నేనై యెట్టి శిక్ష విధించు కొందును తండ్రీ!

(ఆగి, ఆలోచించి) మాడచీ...! అతడు నాకై యే మైన చెప్పుమనినాడా! నన్నేమనినైన నాజ్ఞాపించినాడా! శాసించి నాడా...మాడచీ!!

మాడచి : అతనితో బాసచేసిన విధమున నా అలరాజు మృతికి ప్రతి

చేసి తన ఆత్మకు శాంతి నొడగూర్చి, అమరధామమునసైన తనకు దర్శనమీయకోరినట్లుగ విన్నవింపు మనినారు బాబూ!

(కన్నీటిని చిందుచు, నడవలేక నడచుచూ, మలిదేవుని చేరి, మూడచి తెచ్చిన వస్తువుల నొసంగును. మలిదేవుడును సగౌరవముగ విచారమున స్వీకరించును. అంత దనుక మౌనమున, గంభీరముగ నున్న బ్రిహ్మన్న తలనెత్తి సభను నలుదంకల పరికించి చూచును. రాయబారులు ఖిన్నవదనులై నిట్టూర్చుచుందురు.)

బ్రిహ్మ : నేటి కీ సభను చాలించి, తిరిగి తుది నిర్ణయమును వినుటకు రేపటికడ కలియవలసినదిగ రాయబారులను మలిదేవమహీనాథుని మంత్రి కోరుచున్నాడు!

(నిట్టూర్చి)...విధి బలీయమైనది...!

మలి : (లేచి మెల్లగ బారితీయును. సభయంతయు నతని ననుసరించును.)

(యవనికపతనము)

## పదవరంగము

[నలగామ నరసింహులు సభాభవనమున ప్రిసంగించుకొనుచుందురు.]

నర : ఏ దుర్ముహూర్తమున నాయకురాలి హృదయాంతరాళమున బాలచంద్రి పిశాచము తాండవింప నారంభించినదో, ఏ దుర్ముహూర్తమున నలగామ నృపాలుని హృదయసీమను కరుణరస తరంగిణి హద్దులుమీరి పొరల మొదలిడినదో, ఆ సమయముననే మనపై అననుకూలఝంఝామారుతమును వీవదొడగినది ప్రభూ! నేటికి రాయబారములు విఫలమైనవని విచారించుట కంటె నాగమ దైన సాహసమే విచ్ఛిన్నమైన దనుకొనుట భావ్యము కదా!

నల : బాలచంద్రుని ప్రిభావము నెరుంగవు నరసింహా! అతడొక్క నాయకురాలి సాహసమునే కాదు, వేనకువేల నాయకురాండ్రయు నరసింహులయు సాహసములను గూడ ఛిన్నాభిన్నములు చేయ గలడు; గ్రిహించితివా!

(నరసింహుడు తలవాల్చి కొనును.)

నర : అనాగరికులవలె భూతప్రేత పిశాచాద్యనేకక్షుద్రిపార్తులపై విజయసాధన కాధారపడియున్న బ్రిహ్మనాయుని యెడ భీతికల

భ క్తి విశ్వాసములు మీ అంతశ్శక్తిని గూడ అధిక్షేపించుచున్నవి ప్రభూ !

(నలగాముడు గంభీరముగ ఆలోచించుచుండును.)

అంతకును దైవముమీదనే భారము నిలిపిన మీ హృదయమున కారాటము తగ్గునేమో!

నల : (నవ్వి) దుష్కృత ఫలము దోసిలియొగ్గినంత ననుభవింపకతీరునా నరసింహా!

(అంతలో నాగమ్మ ప్రవేశించి, వారి వెనుకగ నిలబడి, అలజడి కాకుండ నుండును. వారది గ్రహింపరు.)

నర : ఈ తరుణమున మీరే యిట్లు వికలురై యున్న నాయకురాలొక ర్తు యేమి చేయగలదు ప్రభూ !

నల : నరసింహా...!

నర : ప్రభూ...!

నల : నాయకురాలి మనోభావము లిప్పు డెట్లున్నవో...!

నర : ఏమని చెప్పగలను ప్రభూ !

నల: (సాలోచనముగ)రాయబారము విఫలమైనదని వినినప్పటినుండియు నామె భావములను గ్రహించుట దుస్తరముగ నున్నది నరసింహా! బాలచంద్రునిపై ఆమెకు గల అభిమానము నేనును గ్రహించుచునే యుంటిని; కాని, రాజ్యక్షేమమునూ, ఆత్మగౌరవమునూ పాటించు నాయకురాలి యందా భావములు క్షణక్షణ పరివర్తనము నందుచున్నవి. ఏమందువు...! నాయకురాలి శక్తి మనకు తెలియనిది కాదుకదా! నా మానసమునను బాలచంద్రుడొక సుస్థిరస్థానము నేర్పరచుకొని యుంటచే అప్పుడప్పుడు నేనును సమరవిముఖుడ నౌచునే యుంటిని. గ్రహించితివా...!

(నాగమ్మ పకపక నవ్వును. నరసింహ నలగాము లటు చూతురు.)

నర : ...మహామంత్రిణియా...!

నాయ : ...లేదు...నాగమ!

నల : భావము...?

నాయ : మహామంత్రిణినై యీ ప్రసంగమును విని సహింప గలుగుటయా ప్రభూ!

నర : ఐన...నాగమవై...

నాయ : రాచకార్యాలోచనాసమయముల దక్క నన్ని వేళలను స్త్రీ సహజ మగు లేతహృదయము నావల బెట్టి చరింపగలనా నరసింహా!

(నలగాముడు లేచి నిలబడును. నరసింహుడు కుపితుడై నాగమ ప్రక్కగ నిలబడి యుండును. రణభేరి మ్రోయుట వారు విందురు.)

నల : పురుషసింహులకు పురుడుపోసెడి యీ గురిజాలలో రణభేరి కల్యాణభేరి యగుటకు సందియ మేమున్నది నాగమ్మా! సమరాంగణమున రక్తఝరుల సుస్నాతు లౌటయె విలాసక్రీడగ దలంచు అనుగు బిడ్డల కీ అమరభూమిలో కొరత లేదుకదా! ఉహుః...! మూర్తి దాల్చిన శౌర్యసంపద యగు యీ నాయకురాలి హృదయానలజ్వాలయందు వెన్నవోలు ఆ బాలచంద్రుని కేరింతలు సాగుటయా!

(గంభీరముగ) నరసింహా! నీ యిచ్ఛవచ్చినరీతిని జరించి, ధర్మచ్యుతికి తావు నీక, గురిజాలరాజ్యరమకు సద్యశముగూర్ప ననుజ్ఞయైనది.

(నరసింహుడు సంతోషమున కృతజ్ఞత చూపును.)

నాయ : నాగమకును అదే సెలవా ప్రభూ...!

నల : ...సందియ మేల...?

(నాగమ్మ కృతజ్ఞత చూపును. వెనుకకు అడుగులు వేసికొనుచూ వారిరువురూ వెడలుదురు. నలగాముడు మరొక దెస కేగును.)

యవనిక పతనము

---

# అమరజ్యోతి　　తృతీయాంకము

## మొదటి రంగము

[కన్నమదాసు అరణ్యమున]

కన్నమ :

ఔరా! కాలికి బుద్ధిజెప్పెదరు; నాయుం డుబ్బిపోవుం గదా
మీ రీ రాజ్యమునన్ జరించుటలు, మీ మీ ధర్మముల్, వానికై
మీరల్ ప్రాణమునే నొసంగుటలు బెర్మిన్ జల్కె; మీ యీ స్థితిన్
వీరుల్ గాంచిన నవ్వరే! నిలు డికేనిన్; పార మీకేటికిన్!

భూతసంతానములారా! నిలుడు! చోరులవలె మీ రివ్విధి బర్వులుతీయ నేను మీ శాత్రవుడ గాను. (దూరముగ చూచి)... ఆగుడు... ఆగుడోయీ మహాత్ములారా...! (వికటముగ నవ్వి)... న్యాయాస్థానమున నిందితునివోలె గడగడ వడంకెద రేల? సత్యదేవత సమ్ముఖమున నసత్యముమాడ్కి క్రుంగిపోయెద రేల? నా పలుకు లాలించి మీ మీ విధ్యుక్తధర్మముల నెఱవేర్చికొనుడు. అరెరే! అది యేటి భీరుత్వము నాయనలారా!

చీమ 'చిటుక్కు' మన్న యెడ చిందులుద్రొక్కెడి మీరలేడ, సం
గ్రామతలమ్మునన్ మొఱటుకత్తుల పోరున నిల్చు టేడ, మా
బాముల దీర్ప మీరు నలువంగల సాయ మదేడ, భక్తిమై
మా మలిదేవునిన్ గొలిచి మన్నన లందుటలేడ దెల్పుడీ!

నిలుడు...నిలుడు. సోదరులారా! నిలుడు! బ్రహ్మనాయుని కృతార్థుని సేయ నడుములు బిగింపుడు!

(కొద్దిదూరమున నున్న భూతసంతానమును తిలకించుచు)... ఆఁ...! సర్పరాజములారా! మీర లటు చెట్టుకొమ్మల బట్టికొని ప్రాకులాడుట తగదు. గర్వాంధీభూతులై కన్నుమిన్ను గానక చరించెడి ప్రాణుల

కంఠసీమల కౌగిలించి మీ గరళమును వారి నరనరముసకును జొన్పి వారలకు ముక్తిదానమొసంగుడు. పిశాచములారా...! మీ గోటి గీటుల, నిరాశ్రయుల, బాంధుల బాధిలజేయక వెఱ్ఱిమొఱ్ఱిగ కేరింతలు కొట్టు దుష్టుల హృదయములు చీల్చి చెండాడుడు. మీ ముఖగహ్వరముల ననాథలకుగాక, మదోన్మత్తులకు వాస మేర్పరచుడు. (సంతోష మున)...ఆగితిరా... మిత్రులారా! సెబాసు...జోహారు లిడకుడు... శిరములు వాల్చకుడు...రండు...రండు...ఈ కన్నమదాసు ననుగ్రహింపుడు...రండు...! (వెడలును)

(యవనిక పతనము)

## రెండవరంగము

[చెన్నకేశవాలయమున బాలచంద్రుడు]

బాల:

ఆ గురిజాలభూరమణు నాహవమందున గూల్చి, రక్తపుర్
వాగుల దేల్చి, నాగమను పట్టి వధించి, నృసింహుమస్తక
శ్రీ గడనెత్తి, కొమ్మనృపశేఖరు చిర్నగవుం గ్రహించి, యా
పై గనవత్తు నిన్ మగిడి, బాస యిదే, గొను, చెన్నకేశవా!

ప్రభూ! నా సలిపిన యీశపథమును నీ సుధామయ వీక్షణముల గ్రహింతువా! ఇంతదనుక భోగలాలసత్వమున కన్నుగానని నాకు నీ అనుగ్రహజ్యోత్స్నారాశి నానందించు భాగ్యము నొడగూర్తువా! ఈ చపలచిత్తు నికపైనైన సంకల్పసిద్ధుని చేతువా ప్రభూ!

(బ్రహ్మన్న ప్రవేశించి, కుమారుని శిరముపై చేయినిడి దీవించును. బాలుడు తెలివినంది, తండ్రిని తిలకించి నమస్కరించును. అతడు స్వీకరించును.)

బాల: తండ్రీ! అగర్భశూరుల కాటప్రదేశమును, స్వర్గసీమకు త్రోవయు, ముక్తికాంతావిహారసౌధరాజమునకు మృదుసోపానమును, సర్వసుఖములకు బట్టుగొమ్మయు నగు యీ సమరావనిని బ్రవేశించిన నాకు మీ దీవన లమోఘములో గదా!

బ్రహ్మన్న : కాకేమి నాయనా ! కాని, నీ కియ్యెడ నొండు విశేషమును మాత్రము స్ఫురణకు తేదలంచితిని. క్షాత్రవాసీకము మదోన్మాదమున విజృంభించి యున్నది. నీవు వయసున పిన్నవు. వారి అట్టహాసములకుగాని, శరదీప్తికిగాని, వారణధ్వనికిగాని జడియ రాదోయీ! మండలేశు లెల్లరు మది దల్లడమంద నార్జించిన మన వంశగౌరవమును కళంకితము చేయరాదుసుమా ! బ్రహ్మనాయుని పేరు బ్రహ్మాండమునం దంతటను మారు మ్రోయింపవలెనోయీ! ఏమందువు నాయనా !

(బాలుడు పరాకుగ నుండుట బ్రహ్మన్న గ్రహించును.)

తండ్రీ ! సమరభూమిని కాలిడిన ప్రతియోధుడును వేలకు వేల శ్రవణేంద్రియములకును చక్షురింద్రియములకును మించిన చైతన్యమును కలిగి యుండవలెనుసుమా ! అందు పరాకునకుగాని, గర్వమునకు గాని తావు లేదు కుమారా! నీ వా రహస్యమును బాగుగ గ్రహించితి వేని ఆ నలగాముడే కాదు, శతసహస్రాధికము లగు నలగామజీమూతము లడ్డు వచ్చినను చీల్చివేయగలవు. గ్రహించితివా నాయనా! యీ వచనములు...

బాల : నాకు సర్వథా శిరోధార్యములు గదా తండ్రీ !

బ్రహ్మ : సంతోషము బాబూ! రేచర్ల వంశమునకు నీచత్వ మాపాదింపరాదు సుమా ! మన మలిదేవమహీనాథుడును ఆ అభిప్రాయము తోడనే నీకు సెలవు నొసంగెను... యెఱుంగుదువా...!

బాల : ...బ్రహ్మనాయుని కుమారునకా యింతగ నుపదేశింపవలె తండ్రీ !

(బ్రహ్మన్న సగర్వముగ మందహాసముచేయును. అతడు దారితీయ బాలు డనుసరించును.)

(యవనిక పతనము)

## మూడవ రంగము

[శయనాగారమున నాయకురాలు నిదురపట్టక అటు నిటు దిరుగాడుచుండును. కొంతకాలమునకు యెదుట నున్న తన తండ్రి చిత్రపటము నొద్దకు పోయి నిలబడును. ఆమె మోమున శోకదేవత నాట్యము చేయుచుండును.]

నాయ :......(విచారముతో) తండ్రీ ! నేను శేరాజుతో ముచ్చటించుచు మురియుచుండ నాడు నీ వేమంటివో జ్ఞాపకమున్నదా! అధికారము నభిలషించుటకును నర్హతయుండవలెననికదా...ఆమాటల యథార్థము నేడుగదా నాకు ద్యోతకమైనది. తండ్రీ! రారాజు చెంత మంత్రిణినైతిని......... రాచకార్యనిర్వహణమునం దందెవేసిన చేయిరా యనిపించికొంటిని. మండలాధిపతులే జోహారు లొనర్ప నా యీ శరీరమునుసృజించి పెంచిన నీకు నమస్కృత మర్పించికొనుచు స్వీకరించితిని. ఐన నేమాయె? పెంచి పోషింపనైన యీ నాచేతులకు సర్వమును ద్రుంచి హరించు శక్తి యెట్లు చేకురగలదు నాయనా ! నా స్త్రీత్వమును చంపికొని, ఆ నలగామునకై, పలనాటి రాజ్యము నకై, మతోద్ధారణకై యెంతకాల మని కువలయమునెల్ల సంక్షోభింపచేయగలను తండ్రీ! ఆడుబిడ్డనై నీ కడుపునబుట్టిన నేను యీ రాచరికపు వలలో చిక్కికొనుచుంటి నని తెలిసియు నేల యూకొంటివి నాయనా! పురుషసింహులకు యోగ్యమగు యీ కార్యాచరణమునకుగడంగు నన్నేల ఆశీర్వదించితివి తండ్రీ! బ్రహ్మనాయుని ప్రతాపజ్వాలనూ, బాలచంద్రుని శౌర్యానలమునూ చూచి,మిడుతవలె మడియనున్న నన్నేల కరుణింపవు...? నిన్నెన్నడేని నొప్పించి నే డిట్లనుభవించుచుంటినా...చెప్పుము...నాయనా!

(రోదించుచుండును)

(చారుడు, రెడ్డి, ప్రవేశించును)

రెడ్డి : జయము - జయము...మహామంత్రిణీ...జయము !

నాయ : (చూచి, చకితయై, లేని నవ్వును తెప్పించుకుని) రెడ్డీ ! ఏమి విశేషములు !

రెడ్డి: ఏమని విన్నవింతును తల్లీ! రణరంగమునందంతటను రక్తప్రవాహములు. పోరతిఘోరరూపమును దాల్చినది. మన పదాతివర్గము క్షణక్షణమును క్షీణించుచున్నది...

నాయ: మదపుటేనుగుల బలమో...?

రెడ్డి: (జంకుతూ) అదియు నొక వింతగనున్నది తల్లీ! అప్పుడే అడవి నుండి తేబడిన దంతావళముల ఘీంకారములకు మన బలము వెన్ను చూపుచున్నది దొరసానీ!

నాయ: తరువాత...?

రెడ్డి: పదాతులు పదాతులతోడనూ, రథికులు రథికులతోడనూ, అశ్వచయ మశ్వచయముతోడనూ ఢీకొనుచుండ, ఆహవభూమి యంతయు హాహారావముల జెలరేగుచుండ, బాలచంద్రు డార్చుచు, పరుగులు వారుచు, మన వారల నందర చిందరవందర చేయుచున్నాడు మహామంత్రిణీ!

నాయ: ఆం......! నరసింహుడు డెచ్చట నున్నాడు......!

(రెడ్డి తలవాల్చి కొనును)

నాయ: (తొందరగ) రెడ్డీ! చెప్పవేమి? అతడు క్షేమముగ నున్నాడా!

రెడ్డి: నా కనులార చూచిన దెల్ల విన్నవించి కొంటిని దొరసానీ! నే బయలుదేరు సమయమునకు నరసింహరాజులుంగారి దర్శనము లభింప లేదు...యేమని మనవి చేసికొందును...? కాని...

నాయ: ఆం...! ఏమి జరిగినది...?

రెడ్డి: తోవలో...యెవరో....అమంగళమును శబ్దించినారమ్మా! వెనుదిరిగి చూతునుగదా...యెవ్వరును లేరు...వా రప్పటికే నన్ను గుర్తించి యెచ్చటనో డాగియుందురు తల్లీ!

నాయ: చెప్పుము...వా రేమనినారు!

రెడ్డి: (తడబాటుతో) నరసింహరాజులుం గారి శిరమును బాలుడు తెగనరికె......

నాయ: (పిచ్చిగా) ఆం...! ఆం...! నృసింహుని శిరమే తెగిన దనియా! ఎంతటి ఘోరము! ఎట్టి దారుణము! నృసింహుని

శిరమా...! తెగుటయా ! (కలవరము హెచ్చును) గురిజాల కోట గోడయే కూలిపోయినదా! ...రెడ్డీ...? రెడ్డీ ! అది యథార్థమే యానా ?

(అటునిటు చికాకుగ తిరుగుతూ) నరసింహుని శిరమే తెగిన దనియా...! బాలచంద్రుని ఖడ్గమే త్రుంపినదనియా......!...... అసత్యము...! అదంతయు నసత్యమే...! నే నిప్పుడే అతని నిటకు రప్పింతును చూడుము... !...నరసింహా... !...నరసింహా... !... న...ర...సిం...హా !

(పిచ్చిగ వెళ్ళిపోవును.)

(యవనిక పతనము)

## నా ల్గ వ రం గ ము

గండువారి యింటిముందు. (తందాన పాట)

జై జై, జై జై, జై జై, జై జై, జై జై యనరండీ...తంధానతాన
వెలమబిడ్డలా వీర చరితమూ వినులవిందండీ ,,
వెలమవీరులా ధన్యచరితమూ వెలుగు లీను నండీ ,,
వెలమకత్తిసీ విశ్వమెల్లనూ కొలిచి మురియునండీ ,,
వెలమవారికీ జేజే కొట్టి బలమునందరండీ ,,

(మాడచి ప్రవేశించును)

మాడచి : ప్రస్తుత యుద్ధక్రియాన్ని వర్ణించాల్సిందిగా రాకుమారి అనుజ్ఞ ఐంది.

పాటకులు : (సంతోషంతో)

తాన తందనా తానతందనా తానతంధనాన... తంధానతాన
బ్రహ్మనాయునీ దీవనలందీ బాలుడు కదిలెనుగా ,,
బాలునితోటీ బాలవీరులూ పర్వులెత్తినారూ ,,
అప్పుడు బాలవీరు లెల్లరును యేమని శపథము చేసినారయ్యా
అంటే...

కొమ్మరాజు తా కొమరు గోల్పడీ కుములుచున్నాడూ తంధాన
అగ్నిజేసి యూ పేరిందేవి అలరాజుకు కలిసె ,,
కన్నకల్గిన వారల వగాట మిన్నకుంట తగదు ,,
మిన్నకుంటిమా గురిజా లెప్పుడో మన్నుచేయు మనల ,,
అల్లుని చంపిన నరసింహాలును చెల్లిపోవవలయు ,,
మేడియజూతుము మాయలమారీ మంత్రిణి నాగమ్మ ,,
నెత్తుటేరులో నలగాముండు నిడుర జెంద వలయు ,,
మలిదేవునకూ రాజ్యలాభమూ మనమె గూర్చవలయు ,,
బాస తప్పరూ బాలవీరులూ బాగుగ తలపండీ ,,

అని అన్న బాలచంద్రునకు అనుజులందరూ నమస్కరించి, తమతమ యిష్టములను వెలిబుచ్చి కదనభూమిని చేరినారయ్యా; అంతట...

తానతంధనా, తానతంధనా, తానతంధనానా... తంధాన
బాలునిసైన్యము భండనభూమిని బారులు తీర్చింది ,,
కాలు దప్పా డాకాశమునుండీ కలకల నవ్వాడు ,,
గంధర్వులు వడి దివ్యగీతములు గానముచేశారు
అప్సరాంగనలు హారతి బట్టిరి ఆకసమ్మునుండీ ,,
కిన్నెరలోకపు కన్నె లందరూ కిలకిలలాడారు ,,
భూమి నంతటా పుష్పవర్షమే భోరున గురిసిందీ ,,
తానతంధనా.............
కులగిరు లన్నీ కదలిపోవగా వెలమలదోర్నిడు ,,
అడుగుల నిడుచూ వడి శరములు సంధించి విడిచినాడు ,,
శాత్రవ వీరులు సంక్షోభించిరి శరదీప్తిని చూచి ,,
చాకలిచందూ పరశువు బట్టీ శత్రుమస్తకములా ,,
పరపర నరికెను నెత్తుటేరులూ బిరబిర పొంగంగ ,,
బాలురందరూ భండనభూమిని బిద్దలు చేశారు ,,
గుఱ్ఱపుగిట్టల ఠకఠక శబ్దము కొండ లదర చేసె ,,
దంతావళముల ఘీంకారమ్ములు దశదిశలను మ్రోసె ,,

అడవిలోని జీవమ్ము లన్నియూ వడివడి నడిచినవీ తంధాన
గదలతోటి తలలెగుర కొట్టిరీ
శూలమ్ములు హృదయాల గుచ్చిరీ
బాణాల్ దోసిరి, ప్రాణాల్ దీసిరి
కుత్తుక లన్నీ ఉత్తరించిరీ... తానతంధనా...
పడిన తలలతో బాలురందరూ బంతులాడినారు ,,
రారా! రారా! నరసింహా! యని బాలు డరచినాడూ....,,
ఎచ్చటఁ జూచిన బాలచంద్రుడే విచ్చలవిడి నాడె ,,
కరములు, శిరములు, కంఠమ్ములునున్
కటి ప్రదేశములు, వక్షస్థలములు
పేగుల ప్రోవులు, మాంసఖండములు
ఎచ్చట గాంచిన నింతలింతలుగ యెగురుచుండె నండీ ,,
ఆ కల్లోలము శాత్రవ వీరుల నడలజేసెనండీ... ,,
తాన తంధనా......... ......తంధాన తానా
పారిరి కొందరు బాబో అంటూ
కూలిరి కొందరు కుయ్యో అంటూ
ఆయువు తీరిన వారలెల్ల నాగమ్మ పక్షమండీ... తంధాన
రోదన మొకటే బాలుర కచ్చట లొంగక నిలిచిందీ ,,
బాలుడంతటా విజయశంఖమూ నాటికి పూరించె ,,
జైజై, జైజై, జైజై, జైజై, జైజై అనరండీ ,,

(మాడచి కానిక తెచ్చి, వారి ఒడిలో వేయును. వారు మానస మున నమస్కరించి, పాడుకొనుచూ పోవుదురు.)

(యవనిక పతనము)

## పదవ రంగము

[నలగాముని విలాసభవనమున నలగామ నరసింహుల మంతనము]

నల : ...మన మనుకొనిన దెల్లను...
నర : కలయే ప్రభూ...! వారి సైన్యమంతయు నివురుగప్పిన నిప్పు వలె నున్నది.

నల : బ్రహ్మనాయుని నాయకత్వమేమో !
నర : కాదు. బాలచంద్రుని బలగమే ముందుగ తరలివచ్చినది.
నల : (సాశ్చర్యముగ) కరితురగాదుల సైత మెట్లు తెచ్చిరో...!
నర : మందాది యడవిగల సకల చరాచర జీవరాశియు నా సైన్యమున నున్నదనియే చెప్పవలెను ప్రభూ!
నల : (నరసింహుని భుజమును చరచి) నృసింహా మహేంద్రుమెంతగ భీతి గొనినదోయీ!

(నరసింహుడు సిగ్గిలును)

నల : బ్రహ్మనాయునకు పిశాచగణపు సాయ మున్నదని వింటిమే...?
నర : (మెల్లగ)...అటులనే కన్పట్టుచున్నది ప్రభూ !
నల : (సాలోచనముగ) ఐన...భావికర్తవ్యము...?

(నాయకురాలు ప్రవేశించును)

నాయు : ఏమున్నది...? భూతశాంతికై హోమాదుల నొనర్చుట; ఆపై, కల బలము నెల్లను గలియదీసికొని పయనమించుట...
నల : (అటుదిక్కై... సాశ్చర్యముగ)...ఐన...నాయకత్వమో...!

(నాయకురాలు నరసింహుని వంకచూచును. అతడు చిన్నవోయి ఊంటను గ్రహించును.)

నాయు : నలగాముని ఆజ్ఞనూ, నరసింహుని అభీష్టమునూ నాగమ శిరసావహించును గదా ప్రభూ!
నల : ఐన...సైన్యము నంతను నాయుక్తపరచితివా నాగమ్మా...!
నాయు : ...ఏ ముహూర్తమున నరసింహుని శిరము తెగినదని బాల వీరులు దుష్ప్రచారమును సాగించిరో ఆ క్షణముననే కొన్ని అక్షౌహిణుల సైన్యమును గురిజాల వీడి అరివీరుల నుక్కడంప పయన మించినది ప్రభూ!

(నరసింహుడు సాశ్చర్యముగ చూచును. రణభేరి మోయును; వారది విందురు.)

నల : ఆ భేరీనినాదమున కర్థమేమి నాగమ్మా!
నాయు : మరియొక ఘడియకాలములో మరి మూడు పదాతిసైన్యములు కదల నున్నవని ప్రభూ!

నల : (గ్రహించికొనినవానివలె)...ఓహో! అట్లనా...!

(నలగామ డనాలోచితముగనే బయలుదేరును. నరసింహుడునూ నాగమ్మయు నతని ననుసరింతురు.)

(యవనికపతనము)

## ఆ ర వ ర ం గ ము

[బాలచంద్రుడు రణభూమిలో ప్రవేశించును. నరసింహుడు పారిపోవుచుండును]

బాలు :

ఆగు మోరీ దురాత్మ! ప్రాణాపహారణ
మునకుగావచ్చి వెన్నుచూపుదు వదేల!
కత్తి వీడిన నిన్ను నాగమ్మ యేని
మెచ్చికొనబోదు; బెబ్బులి వచ్చె నిలుము...!

నిలుము...యోధవరా...నిలుము! (చూచి) ఓహో... తమ రేనా...!

న్యాయము గంగలో కలిపి, నాస్తికతన్ గురు రాజ్యకాంక్షమై మాయలుపన్ని, ధారుణి సమస్తము నేల దలంచి, ధర్మముక్ శ్రేయము బల్కు సద్గురుని చిత్తము దల్లడ మంద జేసి, ఆ నాయకురాలి కస్తుదల నాట్యము సల్పెడి నారసింహులా!

ఇక కలవరమునకు గాని, గరళప్రయోగమునకుగాని పనిలేదు. నిలుడు. మీచేత నిలచి సిగ్గిలు ఆ కరవాలము దెస పరికించి, మీహృదయ గాంభీర్యమును మీరే గ్రహించికొనుడు.

(వెన్నుచూపి పోవు నరసింహుడు బాలునిదిక్కై ఆగి వికటముగ నవ్వును.)

నర :......ఎవరది...? ఓహో! బాలచంద్రులా! నరసింహుని శిరమును నరికి తెచ్చినాడనని ఒకసేవకుని తల దుర్రింపికొనిపోయి ప్రగల్భములు పల్కిన వీరరసమూర్తియా!

బాలు : ఊహుం! ఔను! ఆ సేవకునకును యీ నరసింహునకును నడుమ పాటింపనగు భేదము కన్పింపకపోవుటచే అట్టి ప్రమాదమే జరిగినది; ఏ మందురు!

నర : అనుట కేమున్నది? భ్రమించుట బాలచంద్రునకు పరిపాటియే కదా!

బాలు : కావచ్చును. ఐనను... నాయకురాలి సాహచర్యమునకు ఫలమా యీ నరసింహరాజులు గాజులు తొడిగించికొని పలాయనమంత్రమును పఠించుట...!

(నరసింహుడు చురచుర చూచును.)

ఊహుఁ...! ఈ మూగనోము ఎప్పటినుండి ప్రారంభించితివో కదా!

నర : ఇది పరవాలములకు పరిచయ మేర్పరుపవలయు ఖండశభూమి గాని, చలోక్తుల కనువగు గందువారి యిల్లుకాదని బాలునకు జ్ఞప్తి చేయవలయునా...!

బాలు : (నవ్వి) అంతటి ధైర్యముకూడనా! ఐన...ఏదీ...!

(ఇరువురును కత్తులు దూయుదురు. పోరునకు గడంగుదురు. ఇరువురకును గాయములు కలుగును. పోరతిఘోరరూపమును దాల్చిన పిమ్మట బాలుని కత్తి నరసింహుని శిరమును శరీరమునుండి వేర్పరచును. నరసింహుని కళేబరము నెత్తుటేరుల దేలుచుండును. బాలుడు వికటాట్టహాసము చేయుచుండును.)

(యవనిక పతనము)

## ఏ డ వ రం గ ము

[బ్రహ్మన్నా కొమ్మరాజులు గుడారమునకు ముంగిల పచారొనర్చుచుందురు.]

కొమ్మ : నిజముగ నది నరసింహుని శిరమే ననుకొంటిని బావా.. !

బ్రహ్మ : (వికటముగ, సగర్వముగ)అనుకొని మురిసితివి కూడనా...!

(కొమ్మరాజు తల వాల్చుకొనును)

బ్రహ్మ : పగవాని బట్టి వధించుటకంటె వానికి పశ్చాత్తాపము గలిగించుట యుత్తమ మని నీకును తెలియదాయె కదా! చేసిన పాపమునకు చింతిలుచు, శరణార్థినై, ఎత్తునని కబురంపి, ప్రాయశ్చిత్తమును చెల్పుడని కోరిన ఆ నృసింహునకు శిరశ్ఛేదనమా మనము విధింపవలయు శిక్ష! ఉడుకురక్తము మేనిలో ప్రవహించుచుండ నాబాలు డెట్టి ఘోరకర్మాచరణమునకైన వెనుదీయ డని తెలిసియు, వాని ఆవేశమును శాంతింపచేయుటకు మారు ఉద్రేకింప చేయుటయా పెద్దల మనిపించుకొను మన విధి! చూచితివికదా...సమర మొనర్చి

శాతప్రవనసమూహమునుండి ముఖ్యుల పాదాక్రాంతుల చేయింతునని బాసజేసి యతడు సలుపనెంచిన పైశాచికకృత్యము ! బావా! దైవనిర్ణయము వేరుగ నుండెనే కాని, కానిచో నిజముగ నరసింహుని శిరమునే తెచ్చియుండెడివాడు కదా !

(అంతవరకును ఊరకయున్న కొమ్మరాజు ఉద్రేకమున అతనిని వీక్షించును)

కొమ్మ : వేటగానికి మృగములను సజీవముగ తెచ్చుటయో, చంపి తెచ్చుటయో ఇచ్ఛాప్రకారమున జరుగు కార్యములా బావా!

బ్రహ్మ : అభిప్రాయానుసారముగ అత డనుకూలవాతావరణమును సృజించుకొనుట దుర్ఘట మనియా నీ అభిప్రాయము!

బాలుడు : (తెరలో)

మతిచెడి సోదరుండు ఋజుమార్గముదప్పి చరింప, ధారుణీ
పతి కిది పాడికాదటని పల్కని పాపము, నాగసాని నా
గతి భజియించి పొందిన యఘమ్ము, గురూత్తము నాజి గూల్చు కీ
రితి గొననెంచు దోసము ఫలించిన వీ గతి, నీచభూపతీ !

బ్రహ్మ : (అది వినుట నభినయించి) ఏమి ! నరసింహుని పృచ్ఛించి పలుకు బాలచంద్రుని వలె నున్నాడే !

(వినుట నభినయించును)

(బాలుడు అట్టహాసమున ప్రవేశించుచుండును)

బాలు : (తెరలో)

నాల్గు దిక్కులకును నాగమ్మయే రాజ్ఞి
యని తలంచి, యామె నాశ్రయించి,
ఆమె కంటి చిచ్చునం దల్లునిన్ వేల్చి
ధన్యుడైన దొరకు దారి నిందు !

కొమ్మ : (ఆశ్చర్యముగ నటే చూచుచు, పరధ్యానముగ) .....బావా...! ఆ వచ్చెడిది నరసింహుని బట్టి తెచ్చు బాలచంద్రుడేమో!

బ్రహ్మ : (సాలోచనముగ)...కావచ్చును.

(రెం డడుగులు ముందునకు వేసి చకితుడై, కన్నులు మూసికొనును.)

...శ్రీహరీ...!

(బాలుడు నరసింహుని శిరముతో ప్రవేశించును. కొమ్మరాజు తలవాల్చుకొనును.)

బాలు: మామా! వియ్యంకుడు పాదసమీపమునకు వచ్చినను పల్కరింపని యీ విముఖత్వ మేల?

రాయబారిని వధియింప రా దటనుచు
శాస్త్రములు పల్కుచుండ, రాక్షసుని వోలె
అల్లుడున్ రాయబారియు నైన బుధుని
ప్రాణముల దీసి మరియు పాపాత్మ గనవె!

బ్రహ్మ: (గంభీరముగ) బాలచంద్రా...!

బాలు: (సవినయముగ)...తండ్రీ...!

బ్రహ్మ: (చెవులు మూసికొని, ఆగి, కోపమున)

అరివీరుల్ శరణన్నచో విడువుమయ్యా! ధర్మమార్గమ్మునన్
జరియింపం గదవయ్య! మేలవును, వత్సా! యంచు బోధించి, సం
గరరంగమ్మున జేర్చ, నా నుడుల ధిక్కారించి ఖండించి తీ
చిఱుతప్రాయపు నారసింహు శిరమున్; చేసేత, నో దుర్మతీ!

తండ్రీ యని పిలిచి నన్నవమానింపగూడ తలచితివా! బ్రహ్మనాయుని కుమారుడ నని చెప్పికొనుచూ, యింతటి నీచకార్యము నొనర్చి, గోముఖవ్యాఘ్రమువలె, హృదయమున గల పాషాణమును బయల్పరుప నెవ్విధి సాహసించితివోయీ!

(బాలుడు కన్నెత్తి చూడబోగా బ్రహ్మన్న అధికారసూచకముగ అతనిని చూచును. బాలుడు తల వాల్చుకొనును.)

శత్రుని బట్టితినిగదా యని కనబడిన కుత్తుకలనెల్ల నుత్తరించుట యేనా వీరధర్మము! ప్రతీకారస్పురణకు వెరచి, గత్యంతరమును గానక, ఒక అమానుష కృత్యమును సల్పిన యీతని క్షమించు శక్తి లేక శిక్షింప నీ మన సెట్లంగీకరించినదోయీ! బ్రహ్మనాయుని గర్భమున బ్రహ్మరాక్షసి పుట్టెన దను దుర్యశమును కట్టిపెట్టుటకా నీవు జీవించినది! శాస్త్రసమ్మతములైన చతురుపాయములను నీకా దండోపాయమే మే లనిపించినదా! మలిదేవుని చంపిన నొకటియు, నరసింహుని చంపిన వేరొకటియు ననుకొంటివా...! కొమ్మరాజు నీ సల్పిన ఘోర కృత్య

మునకు సంతసించి సన్మానించు ననుకొంటివా...! ఛీ...! నీ ఖేతాళఖడ్గ రాజమున కెట్టి దుర్గతి వాటిల్లినదోయీ!

(కన్నీటిని జార్చుచూ, వగసింహుని శిరము నరచేత నిలిపికొని) నాయనా! ఈ నీ ఖండిత శిరసునుండి జారెడి రక్తబిందువులు నాచే పోషితములౌటనా నా యీ చేతులనే కరడుగట్టుచున్నవి' కమ్మని చూపులను తమ్ములపై ప్రసరింపజేసి, వారి సేవల నంది యానందింపవలయు నీకా యీ నా అశ్రుతర్పణము! మరణించిగాని మరపుల చూచుటకు మనసుపోలేదా నాయనా!

(బాలునివంకఁజూచి) బాలచంద్రా! నీ వెన్నటికిని నా శుభాశీస్సుల నందలేవోయీ! నీ మనశ్శాంతికై దైవారాధన జేయుట తండ్రినైన నా విధి. అదియే నీవు నా నుండి కొనగల మహోత్కృష్టమగు ప్రసాదము.

బాలుడు: (నమస్కరించి, తలవాల్చి) ఇదియేమి తండ్రీ!

బాస దప్పకుండ భండనమ్మున నిల్చి,
వైరి వీరవరుల బట్టి చీల్చి,
వెలమ పౌరుషమ్ము వెలయ జేసిన నన్ను
తూలనాడ నెంచి తేల తండ్రి!

బ్రహ్మన్న: బాలచంద్రా...! (తలనెత్తి పలుకలేక వాల్చికొనును.)

బాలుడు: (నమస్కరించి)... సెలవొసంగుడురా...తండ్రీ...!

బ్రహ్మ: (ఆలోచించుచూ, లోని విచారమును కనపడనీక, గంభీరముగ చూచుచు, శిరమున చేయి నాన్చి)

కీర్తి కన్యాకరగ్రహణము సిద్ధించితీరును నాయనా...!

('అదియేమి' అన్నట్లుగ కొమ్మరాజు బ్రహ్మన్నవంక చూచును.)

బాలు: (కొమ్మరాజు దిక్కై)...మామా...! (నమస్కరించును.)

(కొమ్మరాజు కంట నీర్వెట్టును. బాలుడా యిరువురకు సాష్టాంగపడును. వారి కన్నీటిబిందువు లాతని శిరము నలంకరించును.)

(యవనికపతనము.)

## ఎనిమిదవ రంగము

[సంగరరంగమున నాయకురాలు సైనికుల నుద్బోధించుచూ ప్రవేశించును.]

నాయ :

అన్నను చంపనెంచిన నరాధమునిఁ వధియించి, వెల్మ బ్ర
హ్మన్నను మన్ననం గలిపి, యాహవమందున బాలు గూల్చి, చే
కొన్నయశమ్ము మన్ననల గూర్చెడిగాని, గృహమ్ము జేర నే
మున్నదిరా! పరాభవము నోర్చెదరా గురిజాలవా రిలఁ!

...నిలుడు, నిలుడు, యోధాగ్రేసరులారా...నిలుడు! ఏ రాజన్యుని సేవయం దీ దేహములను పెంచికొనిరో ఆతనికే యీ మీ రక్తమును ధారవోయుడు. ఎందులకుగా నీ కండరములను పోషించికొనిరో అందులకే ఉపయోగింపుడోయీ! ఇంతదనుక నాతని యుప్పు దిని అతనికే యీ నాడు ముప్పు దలపెట్టుటయా...! పుట్టినది గురిజాల సీమ యని మరచితిరా! భండనభూమి నుద్దండులై చరించి, శత్రుమస్తకముల పరపర నరకుటయో, లేక శత్రుహస్తముల నోరగుటయో గాని అన్యమెరుగని వీరకామేంద్రుని సైన్యమా నే డిట్లు వెన్నుజూప దలంచుట! నిలుడు ... పోరుడు ... ఖడ్గరాజముల నడ్డిన కంఠముల నెల్ల విలుంఠన మొనర్పుడు! యోధులారా...

(పరుగుపరుగున నలగాముడు ప్రవేశించును. ఆతనినిచూచి నాయకురాలు తొలగి నిలబడి అతనిని వినుచుండును)

నల : ...పొట్టకై కాయముల నమ్మికొనిన భట్టుమూర్తులారా! కత్తి బట్టిన పిరికిపందలారా! ఆగుడు...! మీమీ కరవాలములను ధరాతలమున బడవేయుడు. వీరరసాబ్ధిచంద్రుడగు బాలచంద్రుని పాదములబడి ప్రాణభిక్ష నర్థింపుడు! చేసిన దోసములకు చింతిలితిమని చెంపలు వేసికొనుడు! నాయకురాలి పన్నాగములకు సాయము చేసిన మీ మీ హృదయములను చింతాగ్నిజ్వాలల ద్రోసి ప్రాయశ్చిత్తము నందుడు! ఒక్కమారుగ, నేకగళమున నందరు గూడి

బాలచంద్రునకు జేజేలు పలుకుడు!...(ఆగి, చూచి)...ఏమి ?
తిరిగి రణోన్ముఖు లౌచుంటిరా! దురాత్ములారా !

(సైన్యమును కలియ ముందునకు పోవును.)

నాయ : ...(వెలికివచ్చి వికటముగ)...నలగామా...! అన్న తమ్ము లొకటియై తుదకు నాయకురాలినా వేర్పరుప దలంచితిరి......! మీ మీ పిరికి గుండెలకు తగిన యౌషధమును నాయకురాలే పోయ గలదు లెండు !

(అంతలో బాలు డెదురుగ అట్టహాసము చేయుచు ప్రవేశించును.)

బాలు : ఉహుఁ... ! నాగమ్మా ! నీ కుతంత్రము లింతింతలే కదా ! ఈ బాలచంద్రుని నిశితకరవాలము నెదిర్చెడి సాహసము నీకు వేయి జన్మములకైన గలుగునా! అన్నతమ్ములకు పోరు గల్పించి పకపక నవ్వుచు నీవెందు డాగితివి! నరసింహునకు వెన్నుచరచి పంపితివి కదా; అతని దుర్గతికి విలపింప నిందేల గన్పడవు! భ్రాత్రురుధిరమును కడుపార గ్రోలితివిగదా! ఇక మిగిలినది నీ కా అమాయకు డగు నలగాముడా...పాపము...

(నాగమ్మ డాగిన స్థలమునుండి ఒక బాణమువచ్చి బాలుని హృదయమున నాటుకొనును. బాలుడు ముందునకు తుప్పించి, బాధ నభినయించును.)

బాలు : అబ్బా...! అబ్బా...!!

(వికటముగ నవ్వుచు నాయకురాలు ముందునకు వచ్చును. ఆమె వెనుకభాగమున విల్లు ధరించిన ఒక సేవకుడు గడగడ వడకుచు నిలబడియుండును.)

బాలు :...ఓహో...నాయకురాలి కుతంత్రమా యిది...!

నాయ : భ్రమింపకుము వీరాగ్రేసరా! ఇది కుతంత్రము కాదు... తూణీరప్రయోగము. (వికటముగ నవ్వును)

బాలు : అట్లనా...! విన...నాయకురాలి యభీష్టము సిద్ధించినదా...!

నాయ : ఏదీ...! నీ చేతికత్తి నిలచియే యున్నదికదా! నీ ప్రలాపము లింకను సాగుచునే యున్నవికదా!

బాలు : ఏమి...! నీతోటి పోరుటకా నన్ను పురికొల్పుచుంటివి! వెనుక నుండి సేవకునిచే శరమును ప్రయోగింపచేసిన యీ నీ దుర్బల

హృదయముననా నా ఖడ్గరాజమునకు నివాసము నేర్పరచుట!
అబ్బా...అబ్బా...(బాధపడును)

నాయ : (దగ్గరకు పోయి) బాలచంద్రా! ఇంక నిట్లేల బాధపడెదవు!
మతమా నాశమునందె, గౌరవమునుగా మండాదిలో కూలె, కీ
ర్తియా ద్యూతమునందె చెల్లె, నిక గర్వింపంగ నేముండె? స
ద్గతి మీ కెయ్యెడ నున్నదోయి! యిసిసీ! ఖడ్గమ్మునుగా జార్చి నీ
నతి సౌభాగ్యము నిల్పికో దగును వత్సా ! చావ నీ కేటికిగా !

బాలుడు : ఓహోహో...ఏటి ఉపదేశము! కోడిపందెమున కత్తికి
విసముబూసి పల్నాడున నర్ధమును జయించితివే ! అడవుల
దిరుగాడువారిపై నన్యాయముగ దాడియొనర్చితివే ! రాయ
బారిని వధించితివే! శైవమతోద్ధారణమున కను మిమతో స్వార్థ
మును దీర్చికొన పల్నాడును సర్వమును నాశమొనర్ప కంకణము
గట్టికొంటివే!... నేడు ... బాలుని నధర్మయుద్ధమున బలిగొన
నెంచితివే! నాగమ్మా! అట్టి నీ హృదయమునుండియేనా యీ పలు
కులు? నాపై గల ప్రేమయేనా ని న్నివ్విధి బల్కించినది?... (బాధ
నటించును)

(నలగామడు ప్రవేశించును.)

నల : బాలచంద్రా...బాలచంద్రా!

బాలు : (శక్తి చిక్కబట్టికొని) ...ఎవరది? మహారాజులా! భీష్ముని
యెదుట శిఖండివోలె నా యెదుట నాగమ్మను నిలిపి నా ప్రాణముల
నపహరింప జూచిన నలగామనృపోత్తములా!(బాధతో తిరుగుచూ)
అబ్బా...! దారుణము. నలగామా! నా ఖడ్గమును చవిచూడ
నీ కిచ్చగలదా!

(నలగాము డతనిని గాంచి కత్తిని జార్చును.)

నల : ...నాయనా...!

బాలు : ఏమి మహారాజా! ఈ తుది ముహూర్తమున గూడ నాతో
బోర నీకు భయమగుచున్నదా...!

(నలగాముడు మౌనముగ అతనిని చేరబోవును.)

(తె ర లో)

నాయనా...! బాలచంద్రా...!! బాలచంద్రా!!!

(బాలు దమితయాతన ననుభవించుచూ, తూలుచూ, ముందున కడుగు లిడు చుండును.)

బాలు: అబ్బా...నాయనా...!...నాయనా...! చెన్న కేశవా...!

(కూలిపోవును. అంతలో బ్రహ్మనాయు డటకు పరుగున వచ్చి, బాలుని పట్టుకొని భుజమున వేసికొనును. నలగాముడు మారుమాట లేక బ్రహ్మనాయుని పాదములపై వ్రాలును. బ్రహ్మన్న వానికి చేదోడై నడచుచుండును.)

బ్రహ్మ: నాయనా...మానవప్రయత్న మంతయు నై పోయినది కదా! అల్లునితోబాటు బాలునిగూడ అమరధామమున కనుపుట యైనది కదా!...రమ్ము...! తండ్రీ......రమ్ము! తమ్ములు నీకై యెంతగ పరితపించుచున్నారు నాయనా! విచారింపకుము...! విధి దాట నేరికిని గాదుకదా...! పిచ్చి తండ్రీ...! విచారింపకుము...! రమ్ము!! రమ్ము!!

(నాయకురాలు తనకు తెలియకయే వారల ననుసరించును.)

(యవనిక పతనము)

స మా ప్త ము

---

అ చ్చు లో ము ఖ్య మై న ది ద్దు బా ట్లు.

| పేజీ | పంక్తి | ఉంది | ఉండాల్సింది |
|---|---|---|---|
| 8 | 14 | చందు | అనపోతు |
| 12 | 8 | తమ ఆజ్ఞ. ఉషా | తమ ఆజ్ఞ ఉషా |
| 16 | 24 | పితృపాదునకు | పితృపాదులకు |
| 21 | 11,12 | లైన్లు పేజీ చివర చదవాలి | |
| 24 | 19 | మాసగృహము | విలాసగృహము |
| 52 | 13 | (ఆచారమా?) | ఆచారమా! |
| ,, | 26 | నల:— | వర:— |
| 56 | 16 | బిమ్మన్న | బమ్మన్న |

నావే......

నాటకం

కవిరాజు

శ్రీనాథుని జీవిత చరిత్ర

నాటిక

ఫ్లూట్...!

కళారాధకుని జీవితం

పద్యకావ్యం

లీల

నేటి యుద్ధంలో
సిపాయిగా వెళ్ళిన ఒక పేద
వాని భార్య విషాద గాథ

అచ్చుకు సిద్ధంగా ఉన్నై